# భేతాళపంచవింశతికథలు



గ్రంథకర్త

కేతవరపు రామకృష్ణశాస్త్రిగారు.

## సరస్వతీ బుక్ డిపో వారి స్వంత ప్రచురణములు.

### స్టేజినాటకములు

**ముత్తరాజు సుబ్బారావుగారివి**

| | | | |
|---|---|---|---|
| శ్రీకృష్ణతులాభారము | 1 | 0 | 0 |
| కచదేవయాని | 0 | 12 | 0 |
| రణతిక్కన | 0 | 12 | 0 |
| మార్కండేయ | 0 | 12 | 0 |
| కుశలవ | 0 | 12 | 0 |
| పద్మిని | 1 | 0 | 0 |
| చంద్రగుప్త (మౌర్యాభ్యుదయము) | 1 | 0 | 0 |

**బలిజేపల్లి లక్ష్మీకాంతకవిగారివి**

| | | | |
|---|---|---|---|
| సత్యహరిశ్చంద్రీయము | 1 | 0 | 0 |
| బుద్ధిమతీవిలాసము | 1 | 0 | 0 |

**కాళ్ళకూరి నారాయణరావుగారివి**

| | | | |
|---|---|---|---|
| చింతామణి | 1 | 0 | 0 |
| మధుసేవ | 1 | 0 | 0 |

**ఇచ్ఛాపురపు యజ్ఞనారాయణ శాస్త్రిగారివి**

| | | | |
|---|---|---|---|
| రజపుత్రవిజయము | 1 | 0 | 0 |
| రాణాప్రతాప్ సింగ్ | 1 | 0 | 0 |

**ఆకెళ్ళ సత్యనారాయణగారివి**

| | | | |
|---|---|---|---|
| జయంతజయపాలము | 0 | 12 | 0 |

**మల్లాది అచ్యుతరామశాస్త్రిగారివి**

| | | | |
|---|---|---|---|
| ద్రౌపదీవస్త్రాపహరణము | 1 | 0 | 0 |
| శ్రీకృష్ణలీలలు | 1 | 0 | 0 |
| భక్తచోఖామేళ | 1 | 0 | 0 |

### స్టేజినాటకములు

**శ్రీ. శే. సోమరాజు రామానుజ రావుగారివి**

| | | | |
|---|---|---|---|
| రంగూన్ రౌడీ (పతిభక్తి) | 1 | 0 | 0 |
| సతీసక్కుబాయి | 0 | 12 | 0 |
| సతీ అనసూయ | 1 | 0 | 0 |
| భీష్మబ్రహ్మచారి | 1 | 0 | 0 |
| ధరణికోట (రెడ్లప్రతాపం) | 1 | 4 | 0 |
| కాలకేతనము (ట్రాజిడీ) | 1 | 0 | 0 |
| తాజ్ మహల్ (జహనార) | 1 | 0 | 0 |
| భోజకాళిదాసు | 1 | 0 | 0 |
| మహాభక్తవిజయము | 1 | 0 | 0 |
| గంగావతరణము | 1 | 0 | 0 |

**పానుగంటి లక్ష్మీనరసింహారావు పంతులుగారివి**

| | | | |
|---|---|---|---|
| పాదుకాపట్టాభిషేకము | 1 | 4 | 0 |
| రాధాకృష్ణ | 0 | 12 | 0 |
| విప్రనారాయణ | 1 | 0 | 0 |
| కోకిల | 1 | 0 | 0 |

**సోమరాజు అచ్యుతరావుగారివి**

| | | | |
|---|---|---|---|
| పత్నీప్రతాప్ అనసూయ | 1 | 0 | 0 |

**ముత్తనేని వెంకటచెన్న కేశవులుగారివి**

| | | | |
|---|---|---|---|
| చండిక | 1 | 0 | 0 |

**సూరి పార్థసారథిశర్మగారివి**

| | | | |
|---|---|---|---|
| రంగూన్ మెయిల్ | 1 | 0 | 0 |

**కేతవరపు రామకృష్ణకవిగారివి**

| | | | |
|---|---|---|---|
| భక్తమీరాబాయి | 1 | 0 | 0 |

వలయువారు:— సరస్వతీ బుక్ డిపో, బెజవాడ.

శ్రీ

# భేతాళ పంచవింశతి కథలు.



గ్రంథకర్త:

కేతవరపు రామకృష్ణశాస్త్రిగారు.



పబ్లిషర్సు:

కురుకూరి సుబ్బారావు అండ్ సన్

ప్రొప్రయిటర్సు—సరస్వతీ బుక్కుడిపో,

బెజవాడ.

మొదటికూర్పు 1000

1938

కాపీరైటు రిజిష్టరు]

వెల రు. 0—౪—0.

శ్రీరామానయానమః.

# భేతాళపంచవింశతికథ



## పూర్వకథ.

చతుస్సముద్రపరివేష్టితం నగుభూమండలమున నొప్పారు భరత ఖండమందు ధారానగర మనుపేరుగల పట్టణము గలదు. అది విశాలమై, నాలుగువర్ణములవారికి నాశ్రయమై, సమున్నతమైన భవనముల కాకరమై, వాసయోగ్యమై యొప్పారుచుండును. ఆపట్టణమునకు గంధర్వసేను డనుప్రఖ్యాతిగల రాజశిరోమణి ప్రభువై రాజ్య మేలుచుండెను. ఆతనికిం బండితులును, ప్రతాపవంతులు నగునిర్వురు కొమరులు గలరు. పెద్ద కొమారునిపేరు భర్తృహరి. రెండవవానిపేరు విక్రముడు. గంధర్వసేనుండు చిరకాలము రాజ్య మేలి స్వర్గలోకము నలంకరించెను. తండ్రియనంతరము జ్యేష్ఠపుత్రుం డగుభర్తృహరి రాజ్యమున కధికారియై పాలించుచుండెను. దేశకాలపాత్రములను, ప్రజలకష్టసుఖములను గుఱుతెఱింగి ధర్మము తప్పక రాజశాసనము గావించుచుండుటచే ప్రజలందఱతనియందు బద్ధానురాగులై రాజభక్తి కలిగి యుండిరి.

ఒకనాడు భర్తృహరిమహారాజు సింహాసనాసీనుడై కొల్వుకూటంబున గూర్చుండి మంత్రిసామంతాదిపరివారంబులతో రాజకీయవిషయములగూర్చి ముచ్చటించుచుండ నాయూరిలో నుండుమహాతపస్వియైన బ్రాహ్మణోత్తముండు రాజసభ కేతెంచి ప్రభువును గని దీవించెను. రా జావిప్రుని సగౌరవముగ గూర్చుండబెట్టి వచ్చినకారణ మేమని యడుగ విప్రుం డిట్లనియె. మహారాజా! నీ కొకదివ్యఫలము నొసంగుచుంటిని. ఇది నాకు పరమేశ్వరు డనుగ్రహించెను. ఈఫలమును భుజించి

నవారికి మృత్యువు లేదు. ఇదియే దీని ప్రభావము. నాకు దీనిని భుజింప నిష్టములేక ధర్మప్రభువగు నీ కొసంగిన దేశోపకారమగునని తలంచి నీ కిచ్చితిని. ఇదియే నేను వచ్చినకారణ మని చెప్పెను. మహారా జాఫలమును కన్నుల నద్దుకొని యాబ్రాహ్మణునకుం గోరినంత ధన మొసంగి సంతృప్తి జేసి యాఫలమును దాను భక్షింప నొల్లక తనప్రేమంపుటిల్లాలగు పట్టపుదేవి కొసంగి దానిమహిమను జెప్పి భక్షింపు మని చెప్పెను. ప్రభువు వెడలిపోయినయనంతరము పట్టపురాణి యాఫలమును దాను తిననొల్లక తన యాంతరంగికరహస్యప్రియు డగుకొత్వాలును బిలచి వాని చేతి కిచ్చి ప్రియుడా! దీనిని భుజింపు మని చెప్పెను. కొత్వాలాఫలమును గొనిపోయి తన యింపుడుకత్తెయగు వేశ్య కొసంగి భక్షింపు మనెను. ఆవేశ్య యిట్టిమహిమగల ఫలమును తా నొక్కతె భుజించిన నేమిలాభము? ప్రభువున కిచ్చిన మిక్కిలి బహుమాన మిత్తురని తలంచి మరునాడు రాజసభ కేగి మహారాజునకు నమస్కరించి యాఫలము నెదురుగనుంచి తాను వచ్చినపని విన్నవించెను.

భర్తృహరి యాఫలమును జూచి గుర్తించి వేశ్యాంగన వచ్చిన వివరమును దెలిసికొని వెంటనే కొత్వాలును బిలిపించి యోరీ! ఈఫలము నీచేతి కెట్లు వచ్చెను? చెప్పుమని యడుగ కొత్వాలు భయకంపితుడై మాటాడజాలక పోయెను. మహారాజు వానిం జూచి యోరీ! అడిగిన దానికిం బ్రత్యుత్తరమును వచింపవేని తల దీయబడునని భయపెట్ట నాతడు గడగడ వడకుచు మహారాజా! క్షమింపుడు. నా కీఫలమును రాణిగా రిచ్చిరని చెప్పెను. రాజునకు శరీర మంతయు కొయ్యబారిపోయెను. వెంటనే కొలువు చాలించి యంతఃపురమున కేతెంచి రాణిం జూచి వెనుక నేను నీకిచ్చిన దివ్యఫలము నేమిచేసితి వని యడిగెను. ఆ మూర్ఖురాలు తాను జేసినపని ప్రభువునకు దెలియదని నమ్మియుండెను. గాన పాపము బద్దలుగాక మానదను నీతిని విశ్వసింప దయ్యె.

అందువలన ధైర్యముతో నాధా! నే నా ఫలము నానాడే తిని యుంటిసని ప్రత్యుత్తరమును వచించెను. రాణియొక్క దుర్మార్గమును జూచి యామె పల్కిన యసత్యాలాపములను వినఁగనే ప్రభువునకు మహాగ్రహము గలిగి యోసీ! మాయలాడీ! పాలవంటివంశమునకు మచ్చ గల్గించితివి. పాపినీ! యని బట్టలో దాచినఫలమును జూపి యీఫలము కొత్వాలుస కెట్లు వచ్చినదని యడుగ నామె రహస్యము బట్టబయ లయ్యెను గదాయని తెలుసుకొని భయకంపితయై మూర్ఛిల్లెను. భర్తృహరి వెంటనే కొల్వుకూటమున కేగి మంత్రిని జూచి, అమాత్యా! రాజద్రోహియైన కొత్వాలున కురిశిక్ష విధించితిని. నేను రాజ్యమును బరిత్యజించి యరణ్యమున కేగుచుంటిని. నాసహోదరుడైన విక్రమునకు రాజ్యాభిషేకమును గావించి కులటయైన పట్టపురాణిని రాజ్యమునుండి వెడల గొట్టుము. ఇది నాయాజ్ఞ.

అని చెప్పి భర్తృహరి మరునాడే బయలుదేరి రాజవేషమును దీసివైచి సన్యాసివేషమును దాల్చి వనమున కేగెను. మంత్రు లందరును విక్రముని రావించి శుభలగ్నమున నతనిని రాజ్యాభిషిక్తుని గావించిరి. విక్రముడు విక్రమార్కమహారాజనుపేరుతో రాజ్యపరిపాలన జేయుచు సాహస శౌర్య ధైర్య దాన వితరణములయం దద్వితీయుడై యడిగిన వారికి లేదనకుండ ధర్మము జేయుచు క్షాత్రధర్మానుసారముగ దేశములను జయించి రాజ్యవిస్తీర్ణము గావించి జంబూద్వీపమున కంతకు నధికారి యయ్యెను.

ఒకనాడు విక్రముడు కొల్వులో నుండగా నొకసన్యాసి వచ్చి ప్రభువును దీవించి యతని కొకఫలము నొసంగి వెడలిపోయెను. ఈవిధముగ నాయతి ప్రతిదిన మొక్కొక్క ఫలమును విక్రమున కొసంగి పోవుచుండ నతడాఫలమును కోశాగారమున భద్రపరచుచుండెను. ఒక

నాఁడు విక్రముఁ డాఫలము లేమో పరిశీలింత మని తలంచి యొకఫలమును దెప్పించి దానిం గోయింప నందుండి యొకమరకతమణి బయల్పడెను. దాని కాంతుల కం దున్నవారి కన్నులు మిరుమిట్లు గొల్పుచుండెను. రాజు వెఱఁగుపడి మిగిలినఫలముల నన్నింటిని దెప్పించిచూడ బ్రతిఫలము నుండి యొక్కొక్కరత్నము బయలుదేరెను. విక్రముఁడు తనసభలో నున్న రత్నపరీక్షకులను రావించి యారత్నములను ఖరీదు గట్టుఁడని నియమించెను. వా రారత్నములను బరీక్షించి దేవా! యివి దేవరత్నములవలె నున్నవి. వీనికి మేము విలువఁ గట్టఁజాల మని వచించిరి.

మరునాఁడు మామూలువేళకు యతి వచ్చి ఫలము నొసంగెను. రా జాయతీశ్వరుని జూచి యతీంద్రా! తాము విరాగులుగదా! ఇట్టి రత్నములు మీ కెట్లు లభించినవి? నావలన మీ కెట్టిప్రయోజనము నపేక్షించి యిట్టి దివ్యరత్నముల నొసంగుచున్నారు? మీయుద్దేశ్య మేమో తెలిపెదరా యని యడుగ నాయతి యిట్లనియె. రాజా! రిక్తహస్తములతో బ్రభువులకడకు బోరాదుగావున నాఫలముల నిచ్చితిని. ఆరత్నములు దేవమణులు. తపోధనులము గనుక మాకు అష్టసిద్ధులును గలవు. తత్కారణమున మే మీరత్నములను సమకూర్పగలము. కాని విరాగులమగు మాకు వానితో నేమిపని? ఆరత్నములు మీవంటి ప్రభువులకడ నుండదగినవి. 'రత్నహారీతు పార్థివః' అను న్యాయ మెరుంగవా! కావున వానిని నీ కొసంగితిని. ఇంక నీవలన నా కొకపని కావలసియున్నది. నే నొక జపము చేయుచున్నాను. ఇచ్చటికి నాలుగామడల దూరమునగల యరణ్యములో నొకదేవాలయ మున్నది. నే నచ్చట నివసించి జపము చేయుచున్నాను. నాజపసిద్ధికై పూర్ణాహుతి గావింపవలయును. అందులకు నీసాయము నా కవసరము. రాబోవు భాద్రపద శుద్ధ త్రయోదశినాఁటి యర్ధరాత్రి సమయమున నీవు ఖడ్గహస్తుడవై యొంటిగ రావలయును.

అట్లు వచ్చితివేని నాకార్యము సఫల మగును. అని చెప్పెను. సాహసవిక్రమార్కుడని పేరందిన యామహారాజు వల్లెయని యంగీకరించి యాసన్యాసిని బంపివేసెను. పిమ్మట నియమితదినమునకు విక్రముడు బయలుదేరి ఖడ్గధారియై రాత్రివేళ క్రూరమృగారావసంకులితమైన యాయరణ్యమును నిర్భయముగ గడచి యాసన్యాసియున్న దేవీమందిరమును జేరి యతికి నమస్కరించి నిలువబడెను. సన్యాసి విక్రమునిం జూచి రాజా! వచ్చితివా! సంతసమయ్యెను. ప్రస్తుతము నీవలన నా కొకపని గావలసియున్నది. ఇచ్చటికి రెండుక్రోసులదూరమున నొక శ్మశానము గలదు. అం దొకవటవృక్షము గలదు. ఆచెట్టుకొమ్మ నొకశవము వ్రేలాడుచుండును. దానిం గొనిరమ్ము. నాహోమమున కది కావలయును. అని చెప్ప విక్రము డాయుధధారియై భూతప్రేత పిశాచసంచారముతో గూడి భయదాయకంబైన యాశ్మశానమున కేగి శవమును జూచి, విక్రముడు మహాసాహసముతో నావటవృక్షము నెక్కి శాఖనుండి తలక్రిందుగ వ్రేలాడుచున్న శవముయొక్క బంధనమును దెగగోయ నాశవము క్రింద బడెను. విక్రముడు చెట్టుదిగి వచ్చునప్పటి కాశవము రొమ్ములను బాదుకొనుచు రోదనముం జేయుచుండెను. విక్రము డాకళేబరమును సజీవముగా నెరింగి యోరీ! నీ వెవ్వడవు? ఏటి కిట్లు వ్రేలాడుచుంటివి? నేను విక్రము డనుప్రభువును. దేవీమందిరమందలి సన్యాసి యనుమతిని నిన్ను గొంపోవ వరుదెంచితిని. నీవృత్తాంత మెఱింగింపుమన నాకళేబరము సజీవమై యిట్లనియె. రాజేంద్రా! నేను వచ్చుట కొక నియమ మున్నది. నేను భేతాళుడను. నిన్ను కొన్నిప్రశ్నముల నడిగెదను. వానికి సదుత్తరముల నిచ్చెదవేని నన్ను నీవెంట గొనిపోగలవు. అట్లుగాకున్న నన్ను నీవు తీసికొని వెళ్ళజాలవు. ఇది నీకు సమ్మతమా యని యడుగ విక్రమార్కుడాప్రశ్నములను దెలిసికొనవలయునను వేడుకతో సరే యని యంగీక

రించెను. ఆకళేబరములో నున్న రాక్షసుడు విక్రమునిం జూచి రాజా! నే నడుగబోవు మొదటి ప్రశ్నమునకు సంబంధించిన కథను వచించు చున్నాను. శ్రద్ధతో వినుము—

# ఒ క ట వ క థ.

ప్రతాపముకుటు డనుపేరుగలరాజు రాజ్యమును జేయుచుండెను. అతనిభార్యపేరు మహాదేవి. ఆరాజున కొకకుమారుడు వజ్రముకుటు డనుపేరుగలవాడు కలడు. ఆవజ్రముకుటునకును, మంత్రికొమారునకును మిక్కిలిస్నేహ మగుటచే స్నాన, పాన, విద్యావిషయములయందొక్కచోటనే సంచరించుచుండిరి. కొంతకాలమున కారాజపుత్రుడును, మంత్రిపుత్రుడును సంప్రాప్తయవ్వను లైరి. ఒకనాడు వారిద్దరును గలసి మహారణ్యమధ్యమునకు వేటాడబోయి దినమంతయు వేటలో గడపి సాయంకాల మగునప్పటికి ప్రాంతమందున్న సుందరసరోవరమును జూచి యందు కరపాదముల గడుగుకొని జలంబుల ద్రావి సమీపమునగల శివాలయములోని కేగి యందున్న శివలింగమునకు నమస్కరించి తిరిగి యాసరోవరతీరంబున విశ్రమించిరి. మంత్రి కుమారునకు నిద్ర వచ్చుటచే పరుండెను. రాజపుత్రుడు సరోవరశోభను దిలకించుచుండెను.

కొలదిగడియల కొకరాజపుత్రిక చెలికత్తెలతో పరివారసహితయై వచ్చి శివాలయములోని కేగి పరమేశ్వరుని ప్రార్థించి సరోవరమున నిర్మలజలంబుల గ్రోలి యొకవృక్షచ్ఛాయను విశ్రమించి చెలులతో మాట్లాడుచు ప్రాంతమందు విహరించుచున్న రాకొమరుని గాంచెను. వజ్రముకుటుడును రాకుమారిం గాంచెను. రాజపుత్రిక వజ్రముకుటుని జూచి తనశిరమున నుంచుకొనిన శివపూజానిర్మాల్య మగుకమలమును దీసి చేత బట్టుకొని చెవిలో నుంచుకొని వెంటనే దానిని దంతములతో

కొరికి పాదములకు తగిలించి యాకమలమును వక్షస్థలమున కదుము కొనెను. తదుపరి తనచెలికత్తెలతోఁ గలసి నగరమున కేగెను. రాజకుమారుఁ డామెను జూచినది మొదలు మోహవివశుఁడై యాకన్యకామణి యొనర్చిన కార్యములు తనమనస్సునకు బోధపడకుండుటచే తిరిగి మంత్రి కుమారుని సమీపించి మేల్కొల్పెను. మంత్రిపుత్రుడు నిద్రనుండి లేచిన వెంటనే తాను చూచినవృత్తాంత మంతయు నెఱింగించి యాకన్యకామణి చేసినపనుల నెఱింగించి యిట్లనియె. మిత్రమా! ఆసుందరి యూరుగాని నామమునుగాని నెఱుంగలేక పోయితిని. గాని యట్టి జగన్మోహినిని వివాహ మాడకున్న నాజన్మ వ్యర్థమునుమా యని పల్కుచున్న రాకుమారుని జూచి మంత్రికుమారు డిట్లనియె!

మిత్రమా! ఆచిన్నది యొనర్చిన చర్యలను విమర్శింప నామెయు నిన్ను వలచిన ట్లున్నది. అస్సైగలు నీ కర్థము కాలేదు. నేను వచించుచుంటిని వినుము. తలపైనున్న కమలమును దీసి చెవిదగ్గిర నుంచుకొనుటవలన తాను కర్ణాటకదేశపు రాజపుత్రిక ననియును, దంతములతో కొఱుకుటవలన దంతవక్త్రుఁ డనురాజునకు తనయ ననియు, కమలమును పాదములకడ నుంచుకొనుటవలన తనపేరు పద్మావతి యనియు, వక్షమున కదుముకొనుటవలన నీవు నాహృదయమం దుంటివనియు సూచించినది. ఇదియే యారాజపుత్రియొక్క సాంకేతికాభిప్రాయ మని తెలిపెను. రాజపుత్రుడు వెంటనే యాదేశమునకు పోవుదమని పట్టుబట్టుటచే మంత్రినందను డాతని వెంటగొని తురంగారూఢులై యిర్వురు కొలదిదినముల కాయూరునకు అనగా కర్ణాటకదేశమునకు వచ్చి సత్రములో బసచేసి మధ్యాహ్నకాలము దాటినతోడనే యిర్వురు నగర మంతయు జూచుచు రాజమందిరప్రాంతమున కేగిరి. తత్సమయమున నొకముదుసలియగు స్త్రీ రాజనగరులోనుండి వచ్చుచుండెను. ఆవృద్ధురాలిం గాంచి రాజమంత్రి

నందను లిర్వురును వెంబడించిరి. ఆమె క్రమముగ తనయింటి కేగి గడప లోపల గూర్చుండి రాట్నమును వడకుచుండెను. వెంటవచ్చినవా రిర్వు రును గుఱ్ఱమునుండి దిగి యాయింటిముందుకు వచ్చి నిలువబడిరి. మంత్రి పుత్రు డాముదుసలిం జూచి అవ్వా! మేము పరదేశులము. కొలదిదిన ములు నివసించుటకు నీయింటిలో నవకాశ మొసంగెదవా? నీకు పుణ్య ముండును. అని యామె చేతిలో పదిబంగారునాణెముల నుంచ నావృద్ధు రాలు మిక్కిలి సంతసించి తనయింట నుండుట కంగీకరించెను. కొన్నిదిన ములు గడచినతదుపరి మంత్రినందను డామెవృత్తాంతము దెలిసికొని యిట్లనియె. అవ్వా! రేపు నీవు మీరాజకుమారితో నొకవార్త నెఱిగిం చితివేని నీకు బహుమతి లభించును. అదేమనగా గడచిన జ్యేష్ఠశుద్ధ పూ ర్ణిమనాడు నీవు వనమున జూచిన రాజకుమారుడు వచ్చియుండె నని వచింపుము.

మంత్రికుమారుడు వచించినప్రకార మాదాసి రాజపుత్రికను జేరి ప్రసంగవశమున రాజకుమారునిసంగతి నెఱిగించి యతనియందమును వర్ణించెను. ధనాశగల రాజాంతఃపురదాసీజన మెంతకైన తగుదురుగదా! పద్మావతి దాసివాక్యములను విని కోపమును నటించుచు తనచేతిని మం చిగంధములో ముంచి మైదువ్రేళ్లు కనపడున ట్లావృద్ధురాలిదవడపై తట్టి పొమ్మని యదలించెను. ఆవృద్ధురాలు నిష్కారణముగ రాజపుత్రికకు కోపము గల్గించితి నని విచారపడుచు నింటి కేగి వా రిర్వురకును రాజకు మారి చేసినపనిని వివరించి తనదవడ చూపించెను. రాజకుమారుడు దీని యభిప్రాయ మేమని యడుగ మంత్రినందను డిట్లనియె. మిత్రమా! అయి దువేళ్లు తేలునట్లు కొట్టుటవలన నామె అయిదుదినములవరకునని సూచిం చినది. వెన్నెలదినము లైదును గడచినవెనుక చీకటిరాత్రులు వచ్చును. అప్పుడు సమయ మగునని తెలిపినది. అని చెప్పెను.

ఆరవనాడు మరల వృద్ధురాలు వీరిర్వురిసందేశమును పద్మావతి కెఱింగింప నామె యెఱ్ఱనికుంకుమతో ముదుసలిదానిదౌడపై మూడు బొట్లు పెట్టి పంపెను. మంత్రికుమారుడు చూచి రాజపుత్రునితో పద్మావతి ఋతుమతియై యున్నదనియు నాలుగవనాడు స్నానానంతరము సమయ మగునని సూచించినదని చెప్పెను. నాలుగవనాడు పద్మావతి వృద్ధురాలితో రాకొమరుడు రాదగినసాంకేతికమును చెప్పి పంపెను. నాటి రాత్రి రాజపుత్రుడు చక్కగ నలంకరించుకొని మంచిదుస్తులను ధరించి నడుమున ఖడ్గమును బిగించి ప్రయాణమునకు సంసిద్ధు డయ్యెను. మంత్రికుమారుడును మారుదుస్తులను ధరించి రాజకుమారుని వెంటగొని యందరు నిద్రించినవెనుక బయలుదేరి రాజకన్యాంతఃపురమునకు పశ్చిమభాగమున గలకిటికీక్రింద నిలువబడెను. పద్మావతి వా రిర్వురు వచ్చుట కొక గొలుసు వ్రేలాడగట్టి యుంచెను. రాజపుత్రు డాగొలుసును పట్టుకొని పై కెక్కి పోయెను. పద్మావతి మరల గొలుసును పైకిదీసి కిటికీతలుపులను బిగించెను. మంత్రినందను డెదురుగ నున్న నొకయరుగుపై కూర్చుండెను. పద్మావతీరాజపుత్రు లిర్వురు పరస్పరము జూచుకొనిరి. పద్మావతి ప్రియుని కై దండగొని శృంగారింపబడి మనోహరముగ నున్న తనగదిలోనికి గొంపోయి హంసతూలికాతల్పమున గూర్చుండబెట్టి చందనమలంకరించి ఫలహారముల నిచ్చి తాంబూలము నొసంగి సరససల్లాపములతో నారాత్రియంతయు రాకుమారునితో నిష్టవినోదంబుల గ్రీడించెను. తెల్లవారుజామున రాజపుత్రుని తనయంతఃపురంబునగల రహస్యప్రదేశమున దాచెను. మంత్రికుమారు డుదయమువరకు కాచియుండి యథాస్థానమున కేగెను.

పద్మావతి యీవిధముగ పరులకు దెలియకుండ తన ప్రియుని పగలు దాచుచు రాత్రులయందు దతనితో సుఖింపుచు నెలదినములు గడ

పెను. మధ్య నొకమారు రాజపుత్రుడు మిత్రునిజూడ బయలుదేరెను గాని పద్మావతి పోనీయక ఆటంకపరచెను. ఒకనాడు రాజపుత్రుడైన వజ్రముకుటునకు జన్మభూమి, తల్లిదండ్రులు, తన ప్రాణమిత్రుడు జ్ఞప్తికి వచ్చుటచే ఖిన్నుడై కూర్చుండెను. పద్మావతి వచ్చి నాధా! నే లేల విచారములో నుండిరని యడుగ నాతడో ప్రియురాలా! నామిత్రుని విడిచి చాలకాలమైనది. ఆతనివియోగము సహింపజాలను. మనయిర్వురి సమావేశమున కాతనిబుద్ధిబలమే కారణము. నీవు చూపిన సాంకేతిక ములరహస్యములను నాకు దెల్పి నీతోడిపొందును ప్రాప్తింపజేసిన మిత్రుని మరచితినిగదా యని చింతించుచుంటిని. అని పల్కిన పద్మావతి నాధా! మీ కంత చింతయేల? నేను రేపు పలురకముల పిండివంటలను వండి మీచేతి కిచ్చెదను. మీమిత్రున కిచ్చి చూచి సంతృప్తులై మరలి రండు. అని చెప్పి పలువిధములైన భక్ష్యములను వండి ప్రియున కిచ్చి రాత్రివేళ నతని బంపెను. వజ్రముకుటుడు మంత్రికుమారునికడ కేగి కౌగలించుకొనెను. మంత్రినందనుడును మిత్రుని జూచి మిక్కిలి సంతసించెను. రాకుమారుడు తనకు ప్రియురా లిచ్చినభక్ష్యములను మిత్రుని యెదుట నుంచి సఖుడా! నాప్రియురాలు నీకొఱకై స్వయముగ వండినది. వీని నారగింపు మన నత డిట్లనియె. చెలికాడా! నీ వామెతో నా విషయము నెఱిగించి ప్రమాద మొనర్చితివి. నీప్రియురాలు నిన్ను సర్వదా వశముజేసికొన దలంచినది. స్వేచ్ఛావృత్తిగల యాడువాండ్రు కుటిల చిత్తులై యుందురు. నీవు నాకడకు వచ్చుటామె కిష్టము లేదు. నిన్ను మరల తల్లిదండ్రులకడకు దీసుకొని పోవుదు ననుభయముతో కపటో పాయమున నన్ను చంపదలంచినది. అని చెప్ప రాజకుమారు డంగీకరింపక నిదర్శనము చూపు మనెను. మంత్రికుమారుడు వెంటనే పద్మావతి పంపిన పిండివంటలలో నొకదానిం దీసి యటనున్న కుక్కముందు బడ వేయ దానిని దిని యాశునకము మరణించెను. వెంటనే చెలికాడా!

చూచితివా? యన రాజపుత్రుడు క్రోధపరవశుడై ఛీ! యికదాని ముఖమును చూడను. మనదేశమునకు బోవుదము లెమ్మని పలుక మంత్రి పుత్రుడు సఖా! నిదానించుము. నీప్రియురాలిని వెంటగొని పోవలెను. నీవు రేపురాత్రి యామెకడ కేగి పద్మావతి గాఢనిద్రలో నున్నతరి యెరింగి యామెయొడలిపై గలనగలను దీసికొని తొడలపై యీత్రిశూలముగు గుర్తుపడునట్లు గ్రుచ్చి వెంటనే పయనమై నాకడకు రమ్ము. తరువాత సంగతిని దెల్పెదను. నన్నుగురించి యడిగెనేని నాకు తెలియదనుము. అని చెప్పి రాజపుత్రుని పంపెను.

వజ్రముకుటుడు మంత్రికుమారుడు చెప్పిన ట్లామెనగల నన్నింటిని సంగ్రహించి తొడపై త్రిశూలమును గుర్తుపడునట్లు ముద్రించి వెడలి పోయెను. మంత్రికుమారుడు రాజపుత్రునితో గలసి యాగ్రామదేవాలయమున కేగి తమవేషంబులను మార్చి యోగులవలె వేషములను ధరించి రాజకుమారుని తనశిష్యునిగ జేసికొని యిట్లనియె. నీ వీనగలను గొనిపోయి రాజనగరునకు సమీపమున గలవర్తకులకు విక్రయింపుము. రాజభటులు వచ్చి పట్టుకొనినచో నాగురువు ఇచ్చెనని చెప్పి వారిని నాకడకు గొని రమ్మని పంపెను. రాజనందనుడు బైరాగివేషమున నగల నమ్ముచుండ రాజభటులు చూచి పట్టుకొని యీనగ లెచ్చటివని యడిగి వివరమును దెలిసికొని గురుశిష్యుల నిర్వురను నగలతో బంధించి రాజుగారి కొలువునకు గొంపోయిరి. రాజు వారిం జూచి ఓ బైరాగులారా! ఈనగలు నాకుమార్తెవి. మీ కెట్లు దొరకెనన మంత్రిపుత్రు డిట్లనెను. మహారాజా! నిన్న రాత్రి మేము శ్మశానములో జపము జేసికొనుచుండ నొకఢాకిని సర్వాభరణభూషితయై మమ్ము సమీపించెను. మే మామెను మంత్రములతో స్వాధీనము జేసికొని యామెనగలను దీసికొని తొడలపై త్రిశూలచిహ్నమును వేసి పంపితిమి. అని చెప్పెను. రాజు అంతఃపురములోని కేగి భార్యను పిలిచి పద్మావతి తొడలపై త్రిశూలచిహ్నము ముండెనో లేదో

చూచి రమ్మని పంప రాణికుమార్తెను పరీక్షించి ఎడమతొడపై త్రిశూల చిహ్న మున్నదని పలికెను.

రాజు కపటయోగిని రహస్యముగ బిలిచి కర్తవ్య మేమని యడుగ నత డోరాజేంద్రా! నీకుమార్తె ఢాకిని. దానిని రాత్రివేళ నూరి బయట వదలివేయుము. లేకున్న నీకు నీరాజ్యమునకు కీడు. అని పలుక రా జారాత్రియే పద్మావతి నిద్రలోనుండ నామెను మంచముతోసహా సేవకుల కిచ్చి రుద్రభూమిలో వదలివేయుడని చెప్పెను. సేవకులు రాజాజ్ఞను బాలించి పద్మావతిని శ్మశానములో వదలి పట్టణమునకు వచ్చిరి. చాటున దాగియున్న రాజకుమార మంత్రినందను లామెను గుఱ్ఱముపై నెక్కించుకొని కతిపయప్రయాణముల నిజనగరిం జేరి తల్లిదండ్రులకు సంతోషము గలిగించిరి. వజ్రముకుటుడు శుభముహూర్తమున పద్మావతిం బెండ్లాడి యామెతో సకలసుఖముల ననుభవించుచుండెనని చెప్పి భేతాళు డిట్లనియె. రాజా! ఈకథలో రాజపుత్రుడు-మంత్రినందనుడు-కొత్వాలు-రాజు నల్వు రున్నారు. ఈనల్వురిలో దోషి యెవరో తెల్పుమన విక్రముడు యోజించి పద్మావతి తండ్రియగు రాజే దోషియని నామతము. ఏమనగా! మంత్రిపుత్రుడు, కొత్వాలు రాజాజ్ఞనునెరవేర్చినవారు. ప్రభువు కోరిక దీర్చుట వారిధర్మము. కావున వారు దోషులు కారు. వలచిన దాని నెట్లయిన స్వాధీనపరచుకొన దలంచిన రాజపుత్రుడు దోషి గాడు. చెప్పుడు మాటలలోని యదార్థమును గ్రహింపలేక కూతురును వెడల గొట్టిన రాజే దోషియని చెప్పగా భేతాళుడు మరల వానిని బట్టి బంధించెను. భేతాళుడు రెండవప్రశ్నమును గూర్చినకథను జెప్ప నారంభించెను.

## రెండవకథ.

రాజా! వినుము. యమునానదీతీరమున ధర్మస్థాన మనునగరము కలదు. గుణాధిపు డనురా జాపురమును బాలించుచుండును. ఆనగరమున

కేశవశర్మ యనుతపోనిష్ఠాగరిష్ఠుడైన బ్రాహ్మణోత్తము డొకడు కలడు. అతని కొకకుమారుడు కుమార్తెయు గలరు. కుమార్తె పేరు మధుమాలతి. కొంతకాలమునకు కూతురు వివాహోచితవయస్క యగుటచే తల్లిదండ్రులు సోదరుడు నామెకు వరునికై బ్రయత్నించుచుండిరి. ఇట్లుండ నొకనాడు కేశవశర్మ బంధువులయింటిలో శుభకార్య మగుటచే నట కేగెను. కుమారు డొకమిత్రుని గృహమున కేగెను. ఇంటిలో తల్లి యొక్కరిత యుండెను.

ఇట్లుండ నాసమయమున పరదేశస్థుడైన యిరువదివత్సరములు వయస్సుగల విప్రు డొక్క డాయింటి కరుగుదెంచి సావడిలో గూర్చుండి యుండెను. ఇంటియజమానురా లాబ్రాహ్మణపుత్రుని కుల, శీల, విద్యాసాంప్రదాయములను విచారించి సంతృప్తి నంది యతనితో నీకు నాకుమార్తె నీయ దలంచితిని. నాభర్త వచ్చువరకు నుండుమని చెప్పెను. విప్రుడు వల్లెయని యటనే గూర్చుండెను. బంధువులయింటి కేగిన కేశవశర్మ యటనున్న విప్రకుమారులలో నొకని విద్యావినయసద్గుణములను గాంచి తనకుమార్తె మధుమాలతి నిచ్చెదనని వాగ్దాన మొసంగి వెంటగొని వచ్చెను. ఇదేవిధముగ నామెసోదరుడుకూడ నొకవిప్రయువకునకు దనసోదరి నిత్తునని చెప్పి తీసికొనివచ్చెను. ఈవిధముగ వా రిర్వురును చెరియొకవరుని దెచ్చునప్పటి కింటిలో నొకవరు డుండుటజూచి కేశవశర్మ తనకూతురును ముప్పురువరుల కిచ్చు టెట్లాయని యోచింప నారంభించెను. విప్రయువకులు ముప్పురిలో నొకనిపేరు త్రివిక్రముడు. రెండవవానిపేరు వామనుడు. మూడవవానిపేరు మధుసూదనుడు.

కేశవశర్మ కర్తవ్యజ్ఞానశూన్యుడై విచారించుచుండ నింతలో భార్య రోదనము జేయుచు వచ్చి మధుమాలతిని పాముకరచె ననియు పడియున్నదనియు వచించెను. తండ్రి దుఃఖాక్రాంతుడై యూరిలోని

కేగి నల్వురైదుగురు విషవైద్యులను మంత్రగాండ్రను పిలుచుకొని వచ్చెను. వా రంద రాపడియున్న విప్రకన్యకను జూచి నాటి తిథి, వార, నక్షత్రములను, కాలములను గమనించి యామె జీవింపదని నిర్ధారణ మొనర్చి వెడలిపోయిరి. కొలదిగడియల కావిప్రబాలిక ప్రాణములను వదలెను. తండ్రి కన్నీరు గార్చుచు కుమార్తె కళేబరమును గొనిపోయి రుద్రభూమిలో దహనము జేసి యింటికి వచ్చెను. విప్రయువకులు ముువ్వురు నాదహనము చేసిన చోటి కేగిరి. వారిలో నొక డామె యెముకల నేరి మూటగట్టుకొని బైరాగివలె వేషము ధరించి దేశములపై కేగెను. మరియొక డామిగిలినబూడిదను మూటగట్టుకొని యాప్రాంతముననే నొకతాటియాకులగుడిసెను నిర్మించుకొని యం దుండెను. మూడవ వా డొకసన్యాసియై దేశములన్నియు దిరుగుచు నొకదినమున నొకయూరిలోనికి బోయి బ్రాహ్మణగృహమున కేగెను. ఆయింటియజమాని వచ్చి యీదినమున మాయింట నతిథిసత్కారము గైకొనవలయునని ప్రార్థింప వల్లెయని యంగీకరించి స్నానము జేసి యొకపీఠమున గూర్చుండి జపము జేసికొనుచుండెను. ఆబ్రాహ్మణుని భార్య వంట జేసికొనుచుండెను. మధ్యాహ్నకాల మగునప్పటికి వంట యగుటయేగాక బ్రాహ్మణుని జపము పూర్తి యయ్యెను. గృహయజమాని వచ్చి స్నానముజేసి దేవతార్చనము పూర్తిజేసి నివేదన మొనర్చెను. ఇంటియజమానురాలు అరటియాకులను పఱచి వడ్డన జేయ నారంభించెను. కొంతవడ్డన యైనది. మరికొన్నిపదార్థములు మిగిలినవి. ఇంతలో నామెకొమరు డైదేండ్లవాడు నిద్రలోనుండి లేచివచ్చి రోదన మొనర్చుచు తల్లిని చుట్టుకొనెను. పిల్లవానిని మరిపింప నెంతప్రయత్నించినను వాడు తల్లిని వదలలేదు. వడ్డించుట పూర్తి కాలే దనుకోపము తొందరయు వెంబడించుటచే పిల్లవాని నొక్కవిసురున మండుచున్న పొయిలో బడవేసెను. చూచుచుండగనే బాలుడు కాలి బూడిద యయ్యెను. అతిథియైయున్న మధుసూదనుడు

చూచి భయకంపితచిత్తుడై వడ్డించిన విస్తరిని వదలి లేచి నిల్చుండెను. గృహయజమాని భుజింపక లేచితివేమని యడుగ నతఁడు బ్రాహ్మణోత్తమా! నీభార్య చూచుచుండగ శిశుహత్య జేసినది. ఇట్టిపాతకము జరిగిన నీయింట నెవ్వరు భుజింతురు? కావున నేబోయెద నని పలుకగా నాయజమాని స్వామీ! తొందరపడకుము. అని లోపలి కేగి యొకపుస్తకమును గొనివచ్చి యందున్న సంజీవినీమహామంత్రమును బఠించి మూలమంత్రమును జపించి జలమును మంత్రించి చనిపోయిన బాలుని యొముకలపై జల్లగా నాబాలుడు సజీవుడై లేచి నిల్చుండెను. మధుసూదను డీవింతను జూచి యాశ్చర్యపడి భోజనమునకు గూర్చుండెను. అనంతర మాత డెట్లైన నావిద్యను నేర్చుకొనినచో తనప్రియురాలిని బ్రదికించుకొనవచ్చునని నిశ్చయించి యాగృహయజమానిని ప్రార్థించి కొన్ని దినముల కాతనిదయవలన నావిద్యను గ్రహించి యాగ్రంథమును సంగ్రహించి మధుమాలతిని దహించిన ప్రదేశమున కేగునప్పటికి త్రివిక్రమ-వామను లచ్చట జేరి యుండిరి వా రిర్వురును మధుసూదనుని జూచి విదేశముల కేగి యే యే విద్యల నార్జించితి వని యడుగగా నాత డిట్లనియె. మిత్రులారా! నేను మృతసంజీవినీవిద్యను నేర్చితిని. దానిప్రభావము వలన చనిపోయిన వారిని బ్రదికింపగలను. అని చెప్పెను. అట్లయినచో మధుమాలతిని బ్రతికింపు మని యడిగిరి. త్రివిక్రముడు తన మూటలో నున్న ప్రధానాంగములకు సంబంధించిన యెముకల నన్నింటిని నొక్కచో నుంచెను. వామనుడు తాను మూటకట్టి దాచిన భస్మమును చుట్టు నుంచెను. మధుసూదనుడు స్నానము జేసి పుస్తకమును విప్పి యామంత్రమును పఠించి జలమును మంత్రించి యాభస్మరాసిపై చల్లగనే మధుమాలతి జీవించెను. ఆవిప్రబాలిక సజీవ యైనంతనే యాముగ్గురు నాకన్యకను స్వీకరించుటకై కలహింప నారంభించిరి. రాజేంద్రా! ఆబాలిక నాముప్పురిలో నెవ్వరు స్వీకరింపదగునో వచింపు మన విక్ర

మార్కుడిట్లనియె. భస్మరాసిని ప్రోవు జేసికొని శ్మశానమున గాపుర మున్నవాడే యాకన్యకకు భర్త యగును. కారణ మేమనగా అస్థులను గ్రహించి దేశభ్రిమణ మొనర్చినవాడు పుత్రతుల్యుడు. ప్రాణదాన మొనర్చినవాడు తండ్రితో సమానుడు. భస్మరాసిని ప్రోవుజేసికొని దహనప్రదేశమును గనిపెట్టుకొని యున్నయాతడే భర్త యగును. అని చెప్పెను. భేతాళు డాసమాధానమును విని మరల చెట్టుకొమ్మ కెగిరి వ్రేలాడుచుండెను. విక్రిమార్కుడు మరల వృక్షము నెక్కి యాతనిని బంధించి, భుజమున వైచుకొని వచ్చుచుండెను.

## మూడవకథ.

భేతాళు డిట్లని చెప్ప నారంభించెను. రాజేంద్రా! సావధానుడవై యాలకింపుము. వర్ధమాన మనునగరము కలదు. రూపసేను డనురాజా నగరమును బాలించుచుండెను. ఒకనా డాప్రభువు కోటసింహద్వారమునకు లోపలిభాగమున నిలువబడి కోటవెలుపల జరుగుకోలాహలమును వినుచుండెను. కొంతకాలమునకు ద్వారరక్షకుని బిలిచి కోటవెలుపల నాకోలాహల మేమని యడుగ నాభటుడు మహారాజా! యాచకులు బహుసంఖ్యాకులు ధర్మార్థులై వెలుపల నిలిచియున్నారు. ఈగందరగోళ మంతయు వారిదే యని విన్నవింప నాప్రభు వాయాచకులను ధాన్యవస్త్రాదులచే సంతోషపరచి పంపుమని నియమించి పంపెను. మరికొంత కాలమున కింకొకభటుడు వచ్చి దేవా! ఎవ్వరో యొక వీరభటు డాయుధపాణియై తమదర్శనమునకు వచ్చియున్నాడని విన్నవించెను. ప్రభు వామాటను విని వానిని కొల్వుకూటమునకు గొనిరమ్మని పంపి తాను దర్బారునకు వెడలిపోయెను. రాజాజ్ఞను పొంది యాసేవకు డావీరభటుని దర్బారులోనికిం గొంపోయి ప్రభువునెదుట నిలువబెట్టెను. ప్రభు వాతనిం జూచి నీ వేమి పనిచేయుదువు? నీ కేమి జీతము కావలయునని యడిగెను.

భటుడు నమస్కరించి మహారాజా! నేను రాజపుత్రుడను. తా మేకార్యము జేయు మనినను సంసిద్ధుడను. నాకు జీతము దినమునకు వేయితులములు బంగారము కావలయు నని యడిగెను. నాభార్య, ఒకకుమారుడు, ఒకకుమారిత, నేను తప్ప నాకుటుంబమున నైదవనారు లేరు. నాపేరు వీరబలు డందురు. ఇదే నావృత్తాంత మని విన్నవించెను. వాని మాటలను విని సభలోనివా రందరును నవ్వుకొన నారంభించిరి. ప్రభు వగురూపసేనుడు మాత్ర మట్లుగాక వీరబలుని వాంఛితమునుగూర్చి తలపోయుచుండెను. ఇంత గొప్పవేతనము నడిగినవారు లేరు. ఇత డెందుల కడిగెను? ఇందులకు బ్రతిఫలముగ నత డేమి చేయునో జూడవలయు నని నిశ్చయించి ఖజాంజీని పిలిచి కొన్నిదినములవరకు నీత డడిగినట్లు దినమునకు వేయితులములబంగారము నిచ్చుచుండు మని యాజ్ఞాపించెను.

వీరబలు డాప్రకారము ప్రభు వొసంగెడి బంగారమును మూడు భాగములుగ జేసి రెండుభాగములు బ్రాహ్మణులకు, బీదలకు దానము కొఱకును సన్యాసి - సాధువులు మొదలగువారియాతిథ్యముకొఱకును వెచ్చించుచు మిగిలినవంతుబంగారమువలన తనకుటుంబవ్యయము జేసికొనుచు కాలము గడుపు చుండెను. మరియును ప్రతిదిన మతడు సంధ్యాకాలమునకే కార్యక్రమమును పూర్తి జేసికొని డాలు, ఖడ్గమును ధరించి రాజు పరుండు శయనమందిరద్వారమున నిలువబడియుండి ప్రభు వెప్పుడు పిలిచిన నప్పుడు సిద్ధముగ నుండుటయే గాక మహారాజున కంగరక్షకుని వలె సంచరించుచుండెను.

ఒకనాడు మహారాజు రాత్రివేళ పరుండియుండ నతనిచెవులకు స్త్రీరోదనము వినబడెను. రూపసేనుడు లేచి కూర్చుండి ఎవరు వారు? అని కేకవైచెను. వీరబలుడు రాజుయొక్క పిలుపును విని దేవా! ఏమి యాజ్ఞ యని యడుగ నతడు ఎచ్చటనుండియో స్త్రీరోదనము వినవచ్చు

చున్నది. బహుశా రుద్రభూమిసమీపమున యని తలంచెదను. నీవు పోయి యారహస్యమును తెలిసికొని రమ్మని పల్కెను. వీరబలుడు చిత్త మని ప్రభువుకు నమస్కరించి వెడలిపోయెను. ఇంతరాత్రికాలమున నీచీకటిలో రుద్రభూమినిగూర్చి పోవుటయన దనసేవకులలో నెవ్వడును సాహసించి యుండడు. ఈవీరబలుడు సాహసించి పోవుచున్నాడు. వీనికార్యక్రమ మేమో చూడవలయు నని తలంచి నల్లనివస్త్రములను ధరించి ఖడ్గమును దుస్తులలో దాచి యాయంధకారములో రాజు వీరభటుని వెనువెంట గూఢముగా బోవుచుండెను. వీరబలు డాధ్వని ననుసరించి క్రమముగ శ్మశానవాటిక కేగెను. అచ్చట నొకసౌందర్యవతియైన స్త్రీ శిరముమొదలు పాదమువరకు సువర్ణాభరణముల ధరించి రోదన మొనర్చుచుండెను. మధ్య నొకమారు గంతులు వేయుచు దనలో దానె నవ్వుకొనుచు మరల నొమ్ము మోదుకొనుచు రోదనము జేయుచుండెను. వీరబలుడు దూరమునుండి యామెయొక్క విధానము నంతయు జూచుచు సాహసముతో సమీపించి నీ వెవ్వతెవు? ఈరుద్రభూమిలో గూర్చుండి రోదనము జేయుచుంటి వేల? అని యడుగ నామె యిట్లనియె. నేను రాజలక్ష్మిని. ఈరూపసేనమహారాజుయొక్క రాజభవనమున సదాచారము నశించి దురాచారము బయలుదేరుచున్నది. జ్యేష్ఠాదేవి ప్రవేశింప బోవుచున్నది. నే నిక నుండజాలను. నే నీప్రభువు నాశ్రయించి చాల శాంతచిత్తనై యుంటిని. కాని నే నెంతయో కాలము నిలువను. మరియు నీరాజు నెలదినములకు మరణించును. అందువలన దుఃఖించుచుంటి నన వీరబలుడు దేవీ! మాప్రభువు చిరంజీవియై యుండుట కేమియు మార్గము లేదా? యని యడుగ నాదేవి వీరుడా! వినుము. ఈరుద్రభూమికి తూర్పుగా నాలుగుకోసులదూరమున నొకదేవీమందిరము కలదు. నీ కుమారుని గొనిపోయి యాదేవికి బలి యొసంగితివేని రూపసేనమహారాజు దీర్ఘాయుష్మంతుడై రాజ్య మేల గలడు. ఇది యథార్థము అని వచించెను.

వీరబలుడు తిరిగి తన యింటికిఁ బోవను బోవుచుండ రాజు వెన్నాడి యతనికార్యక్రమమును గనిపెట్టియుండెను. వీరబలు డింటికేగి భార్యను, కుమారుని నిద్రనుండి లేపి కూర్చుండబెట్టి రాజ్యలక్ష్మి చెప్పిన వృత్తాంత మంతయు వివరించి యిప్పుడు కర్తవ్య మేమి యని యడుగ కుమారు డిట్లనియె. తండ్రీ! నాజన్మము కృతార్థత సందుతరుణము వచ్చినది. ధర్మాత్ముడై మరియును మన కన్నదాతయైన ప్రభురక్షణ మవశ్యకర్తవ్యము. అదియునుగాక జనకాజ్ఞ మరియును బలీయము. ఇంతేగాక నా దేహము పరమేశ్వరియైన కాళీమాత కర్పిత మగుచున్నది. ఎప్పుడో యొకప్పు డీశరీరము నశించునదే. కావున జన్మ సార్థక మగుమరణ మానందకరము గావున నాలస్యము జేయక పోదము రమ్మని వచించెను. వీరబలుడు భార్యం జూచి గృహిణీ! జనకాజ్ఞను బాలించు కొమరుడు-రోగహీన మగుదేహము - సర్వలాభకరమైన విద్య - చతురుడైన మిత్రుడు - పతియాజ్ఞను జరించు భార్య కలవాడు ధన్యుడని పెద్ద లందురు. కావున నీవు నీకొమరుని సంతోషముతో నావెంట బంపెదవా? యన నామె యిట్లనియె. నాథా! ప్రపంచకమున నాకు కుమారుడు, కుమార్తె, సోదరుడు, బంధువు మొదలగు వారితో నెట్టి యవసరమును లేదు. నా కార్య మంతయు మీతో నున్నది. నాసద్గతి మీరే. స్త్రీలకు వేరు వ్రతములుగాని, దానముగాని, పూజలుగాని లేవు. పతిసేవయే ప్రధాన వ్రతము. దరిద్రుడుగాని, కుంటిగాని, గ్రుడ్డిగాని యెట్టివాడైనను వానిని సేవించి వానియాజ్ఞల నొనర్చి తరింపవలయు నని శాస్త్రములు ఘోషించుచున్నవి. పతియాజ్ఞను దిరస్కరించిన యువతికి నరకమె గతియని పెద్ద లందురు. కావున మీయాజ్ఞయే నాకు కర్తవ్యము. మీసంకల్పమే నాకు శిరోధార్యము. ఇంతకన్న నేను చెప్పవలసినది లేదని వచించెను. కుమార్తె తండ్రిని జూచి నాన్నగారూ! ప్రాణముల నిచ్చియైన ప్రభువును రక్షింపవలయును. రాజు లేకున్న రాజ్య మరాజక మగును. ప్రజ

లనేక కష్టములకు బాల్పడుదురు. కావున ప్రభురక్షణముకొఱకు మన కుటుంబ మంతయును త్యాగమునకు సిద్ధపడవలయును. అని చెప్పెను. ఈవిధముగ వారు నల్వు రాలోచించుకొని బయలుదేరి యరణ్యము దాటి దుర్గాలయమును జేరిరి. కుమారుడు దేవిముందు సాష్టాంగపడి తల్లీ! లోకమాతవైన నీకు నాశిరమును కానుకగా నొసంగుచుంటిని. ఈయుప హారమును గైకొని మాప్రభువును- ఆతనివంశమును- రాజ్యమును రక్షిం పుము. అని పల్కి మెడను వంచి తండ్రీ! సిద్ధముగ నుంటినన వీరబలుడు వెంటనే ఖడ్గ మెత్తి జయ పరమేశ్వరాయని యొక్కవ్రేటుతో కుమారుని శిరమును తెగ నరికెను. తల తెగి క్రింద బడెను. సోదరుని మరణమును జూడలేక చెల్లెలు తటాలున తండ్రిచేతి ఖడ్గము నందుకొని తన శిరమును ఖండించుకొనెను. బిడ్డల మరణమును జూచి గుండెలు చెదరిపోయి తల్లి యును కరవాలమున తనశిరమును కాళికి కానుకగా నర్పించెను. ఇట్లు కొమరుడు, కొమరిత, భార్య మరణించుట జూచి ఆహా! నే నెవరిని పోషింప ధన మార్జించుచుంటినో యట్టి దారపుత్రాదు లీలోకమును బరిత్యజించిరి. ఇక నెవరికొఱకీధనార్జనము? ప్రభువును రక్షింప దలంచిన నాకోర్కె నెఱవేఱినది. ఇంక నాప్రాణములతో నవసరము లేదు. అని తలంచుచు చేతిఖడ్గముతో పొడుచుకొని వీరభటుడు తన ప్రాణములను వదలెను.

చాటుననుండి చూచుచున్న ప్రభువు వీరబలుని సంపూర్ణ త్యాగ మును జూచి ఆశ్చర్యపడినవాడై ఆహా! ఒక్కనా జీవితము కొఱ కీకుటుంబ మంతయు నాత్మహత్యకు బాల్పడినదే. వీరిస్వామిభక్తి లోకా తీతమైనది. ఇట్టి మహాత్ముని కుటుంబము నాకొఱకై ప్రాణపరిత్యాగము జేయ నే నేల జీవింపవలయును? అని తలంచి రూపసేనుడు క్రిందపడి యున్న ఖడ్గమును గైకొని తనకంఠమును నరుకుకొన బోవుచుండ దేవి ప్రత్యక్షమై నీ సాహసమునకు భృత్యవాత్సల్యమునకు సంతోషించితిని.

నీ కిష్టమైనవరము నడుగుమన రూపసేనుడు దుర్గపాదములకు ప్రణమిల్లి లోకజననీ! నాకై యీవీరబలుడు కుటుంబసహితముగ మరణించినాడు. కావున సకుటుంబముగ వీనిని బ్రదికింపుము. ఇదే నావాంఛ యనవుడు దుర్గాదేవి సంతసించి వీరబలుని భార్యాపుత్రులతో సజీవుని గావించెను. వీరబలుడు భార్యాపుత్రులతో నిద్రనుండి లేచినట్లు నిలువబడెను. రూపసేనుడు వీరబలుని కౌగలించుకొని యతని స్వామిభక్తికి మెచ్చుకొని తన రాజ్యములో సగభాగ మాతని కొసంగెను.

అని చెప్ప విక్రమార్కుడు వీరబలుని స్వార్థత్యాగమునకు పలు విధముల మెచ్చుకొని ఇట్టి విశ్వాసపాత్రులైన భృత్యులుగల ప్రభువు ధన్యుడని మెచ్చుకొనెను. భేతాళు డిట్లనియె. రాజా! ఈయైదుగురిలో నెవరు త్యాగశీలురని యడుగ విక్రమార్కు డిట్లనియె. ప్రభు వగురూపసేనుని త్యాగమే గొప్పది. కారణ మేమనగా? జనకాజ్ఞను పాలించుటకై పుత్రుడును, సోదరమరణమును జూడజాలక పుత్రికయు, సంతతియొక్క దుర్మరణమున కోర్వలేక తల్లియు మరణించుట స్వాభావికములు. స్వామి కొరకు సంపూర్ణత్యాగమునకు సిద్ధపడుట వీరబలునకు ధర్మము. సేవకుని ధర్మబుద్ధికి సంపూర్ణత్యాగ మొనర్చినందులకు బ్రతిఫలముగ దనప్రాణముల గోల్పోవ దలంచిన రూపసేనుని త్యాగమే గొప్పది. అని పలుకగా భేతాళుడు తటాలున పైకెగిరి చెట్టుకొమ్మను వ్రేలాడుచుండెను.

## నా లు గ వ క థ.

విక్రముడు మరల భేతాళునిబట్టి తెచ్చుచుండగా భూతాధిపతి యిట్లు చెప్ప నారంభించెను. రాజా! భోగవతి యనునగరమును కీర్తికేతుడను రాజు పాలించుచుండెను. ఆరాజుదగ్గర త్రికాలవేదియైన చిలుక యొకటి కలదు. ఒకనాడు రాజు చిలుకను సమీపించి యోకీరరాజమా!

నే నొక్కటి అడిగెదను. ప్రత్యుత్తరము నిచ్చెదవా యన నాచిలుక రాజేంద్రా! నీ వెట్టిప్రశ్నము నడిగినను చెప్పెద నన రాజు నాకు దగిన భార్య యెచ్చట నున్నదో చెప్పు మనగా నాశుకము రాజా! మగధేశ్వరుని కుమార్తె యగు చంద్రావతి యనుకన్యక గలదు. ఆమె సౌందర్యవతి, గుణవతి, విద్యావతియు నని ప్రసిద్ధి జెందినది. ఆమెయే నీకు దగిన భార్య యని వచించెను. కీర్తికేతుడు మరునాడు సభలోనుండి తనపట్టణములో నున్నగొప్పజ్యోతిష్కుని రావించి చిలుక నడిగినప్రశ్నము నడిగెను. ఆజ్యోతిష్కుడు లెక్కవేసి ప్రశ్నమును జూచి దేవా! మగధేశ్వరుని కుమార్తెయే నీకు భార్య యగు నని చెప్పెను. ఆమాటను విని యొకబ్రాహ్మణుని బిలిపించి విప్రోత్తమా! నీవు మగధేశ్వరునికడ కేగి యతని కుమార్తె చంద్రావతిని నా కొసగు నట్లు చెప్పి సంధానము జేసికొని రమ్ము. నీకు విశేషించి బహుమతుల నిచ్చెద నని పల్కి యాపాఱుని మగధేశ్వరునికడ కంపెను.

చంద్రావతిదగ్గర నొకమైనాగోరువంక గలదు. ఆపక్షియు నెవ్వరెట్టిప్రశ్నము నడిగినను చెప్పగలదు. ఒకనాడు చంద్రావతి దానిని సమీపించి మైనా! నాకు తగినభర్త యెవ్వరో చెప్పెదవా యన నాశారిక రాజకుమారీ! భోగవతీనగర మహారాజగు కీర్తికేతుడు నీకు భర్త యగును. అని చెప్పగా నాకన్యక చూడకున్నను కీర్తికేతునిపై వలపు గలిగి యుండెను. భోగవతీపురబ్రాహ్మణుడు మగధేశ్వరుని కొల్వుకూటమునకేగి ప్రభువును దీవించి యాతనిచే గౌరవింపబడి పీఠమున గూర్చుండి కీర్తికేతునిసందేశ మెఱింగించి యతనిప్రతిబింబమును చేతి కిచ్చెను. మగధేశ్వరుడు సంతసించి తనపుత్రిక యనుమతినిగూడ గైకొని యొకబ్రాహ్మణుని పిలిచి బ్రాహ్మణోత్తమా! నీ వీవిప్రునితో భోగవతీనగరమునకేగి కీర్తికేతునితో మే మంగీకరించితి మనియు, శుభలగ్నమును విచారిం

చి పెండ్లికి తరలి రావలయునని చెప్పి మే మిచ్చుకానుకల నతని కొసంగి రమ్ము. అని చెప్పి పంపెను. బ్రాహ్మణు లిర్వురును శీఘ్రకాలములో భోగవతీనగరముం జేరి ప్రభువు కొల్వుకూటమున కేగి నిలువబడి యాశీర్వదించి యొకచోట నాసీనులైరి. మగధేశ్వరుని యంగీకృతిని విని కీర్తికేతుడు సంతోషముతో శుభలగ్నమునకు సపరివారుడై పెండ్లికి తరలి పోయెను. మగధేశ్వరుడు చంద్రావతి నిచ్చి పరిణయము గావించి మహావైభవముతో వేడుకలు జరిపెను. కొలదిదినములకు కీర్తికేతుడు భార్యతోడను, పరివారముతోడను మగధేశ్వరుని యనుమతిని గొని తననగరమునకు వచ్చెను. చంద్రావతి వచ్చునపుడు తనప్రాణపదమగు గోరువంకనుగూడ దెచ్చుకొనెను. రాజు చిలుక గోరువంకల పంజరములను రెండింటిని చంద్రావతియంతఃపురమున గట్టించెను.

ఒకనాడు కీర్తికేతుడు భార్యతో నంతిపురమున సరససల్లాపములనాడుచు నిట్లనియె. దేవీ! మన మీశుకశారికలకు వివాహము చేయుదమా యన నామె యంగీకరించెను. మరునాడు రాణి రాజు లిర్వురును గూర్చుండి శుకశారికలకు వివాహము జేసి యీరెండింటి నొక్క సుందరమైన పంజరమున నుంచిరి. నాటిరాత్రి చంద్రావతీకీర్తికేతు లిర్వురును పరుండియుండ పంజరములోని శుకము శారికను జూచి ప్రియురాలా! మన మిర్వురము కేళీవిలాసముల ననుభవింతము. భోగమునకన్న నధికమే మున్నదని పలుక శారిక యిట్లనియె. నాకు పురుషజాతియన్న విరోధము. పురుషులు దుర్మార్గులు, క్రూరులు, హంతకులు. ఆజాతిని నమ్మరాదని పలుక శుక మిట్లనియె. నీవు పొఱబడుచుంటివి. స్త్రీ లెంత సాహసమునకైన వెనుదీయరు. పాపములకు, విశ్వాసఘాతుకత్వమునకు యువతులు స్థానములు. స్త్రీ జాతియంత దుష్టజాతి వేరు లే దనెను. ఆ రెండింటి కిట్లు వివాదము జరుగుచుండ ప్రభు వాశుకశారికలను బిలిచి

వారివివాద మే మని యడుగ రాజిక తనయభిప్రాయ మెఱింగించి మహా రాజా! పురుషుల దుర్మార్గమునకు మీా కొకయుదాహరణమును దెల్పెద నాలకింపుడు.

మహేంద్రపురమున మహాధనికుం డని పేరుగాంచిన మహాధనుడను వర్తకుడు గలడు. అతనికి చిరకాలము గడచినను సంతానము కలుగకపో పుటచే తీర్థయాత్ర లొనర్చియు - పెక్కువ్రతము లొనర్చియు - మహా త్ముల సేవించియు - సవిధముగ పెక్కుపుణ్యకర్మ లొనర్చుటవలన నతని కొకకుమారుడు గల్గెను. మహాధను డానందభరితుడై ధనమును విచ్చల విడిగా వెచ్చించి పుత్రోత్సవమును బంచిపెట్టెను. బ్రాహ్మణుల కవ్వా రిగా ధనము నొసంగెను? బీదల కన్నదానము జేసెను. ఆబాలునకు శై శవము గడచి యైదవయేడు వచ్చుటజూచి తల్లిదండ్రులు కేశఖండన మొ నర్చి చదువ వేసిరి. లేకలేక పుట్టినబాలు డగుటచే గారాబముగా పెరుచు చుండుటచే నాబాలుడు క్రమముగ భయభక్తులు లేక పాఠశాలకు బో యి పాఠములు చదువక బాలురతో జూదము లాడుచు, కలహించుచు నాటపాటలచే ప్రొద్దు బుచ్చుచుండెను. ఈవిధముగ బదునెన్మిదేడులు వచ్చునప్పటికి సకలదుర్గుణములు పట్టుబడెను. క్రమముగ వారనారీసాంగ త్యమును సంపాదించుటచే ధనమును మంచినీటివలె ఖర్చు పెట్టుచుండె ను. కొంతకాలమునకు ధనశూన్యుడై తనయూరు వదలి చంద్రపురమను నగరమున కేగి హేమగుప్తుడను వర్తకునియింటికి బోయెను. హేమగుప్తు డతని నాదరించి వృత్తాంత మడుగ నిట్లనెను. నే నొకవర్తకుని కుమారు డను. సరకుల నోడ కెక్కించి ద్వీపాంతరమున కేగి వాని నమ్మి ధనము తోగూడ తిరిగి స్వదేశము జేరుచుండ తుపానుగాలి విజృంభించి నే మున్నయోడను ముంచివైచెను. అందరు చనిపోయిరి. నాచేతి కొకయో డకొయ్య దొరకినది. దాని నాధారము జేసికొని కొట్టుకొనిపోవుచు

మూడుదినములకొకరోజు జేరితిని. పరివారము పోయినది. ధనము సముద్రములో గలసినది. కట్టుగుడ్డలతో నీవిధముగ స్వదేశము జేరబోవుచుంటిని. ఇదియే నావృత్తాంతము.

అని చెప్ప హేమగుప్తుడు విని చాల విచారించి తనమనమున నిట్లు తలపోసెను. ఇత డొకధనికుడగు వర్తకుడు. కాలక్రమమున నిట్లు కష్టములకు బాల్పడెను. దరిద్రము చిరస్థాయిగా నేరదు. కావున నా కన్నయొక్కకుమారిక నీతని కిచ్చి యింట నుంచుకొనెద నని తలంచి భార్యకడ కేగి తనయభిప్రాయ మెఱింగింప నామెయు భర్తయభిప్రాయమున కంగీకరించెను. వెంటనే హేమగుప్తుడు బ్రాహ్మణుల రావించి శుభలగ్నము నేర్పాటుచేసి తనకుమార్తె యైన చంద్రిక నిచ్చి కన్యాదానమొనర్చెను. మహాధనుని కొమరు డిట్లు చంద్రికను బరిణయమై మామగారియింట కొంతకాలము సుఖముగ నుండి యొకనాడు భార్యతో తన స్వదేశమునకు బోవలయునని వచించెను. చంద్రిక పతియభిప్రాయమును తల్లిదండ్రుల కెఱింగింప తండ్రి యిట్లనియె. పరాధీనయైన కన్యయందు మన కెట్టిస్వాతంత్ర్యమును లేదు. ఆతడు వెళ్లదలంచిన మాయభ్యంతరమేమియును లేదు. అని చెప్పి యల్లుని బిలిచి నాయనా! మాకు చంద్రిక యేకమాత్రసంతానము. చిరకాల మామెను వదలి యుండజాలము. కావున మీస్వదేశమున కేగి శీఘ్రకాలములో నీ రిర్వురు మరలి రావలయునని నాకోరిక. తదుపరి నీయిష్టము. అని తనయభిప్రాయ మెఱింగించి పెక్కునగలు, సారెచీరలు, అల్లునకు ధనము బహుమతుల నొసంగి కుమార్తెను జామాతను సాగనంపెను. చంద్రిక యొకపరిచారికను వెంట నిడుకొని సవారి నెక్కి భర్త వెంట బోవుచుండ నొకచోట రాత్రి యయ్యెను. చీకటిపడినతోడనే భార్యయైన చంద్రికను జూచి నీనగ లన్నియు నాచేతి కిమ్ము. రాత్రివేళ చోరులు చూచిన ప్రమాదము. నేను భద్రపరచి

యుదయమైనంత నొసంగెద నని వచింప చంద్రిక పతిమాటలను నమ్మి తననగల నన్నింటిని దీసి యతనిచేతి కీయ నాదుర్మార్గు డొకరాత్రివేళ బోయీలకు ధన మిచ్చి సాగనంపి వెంటనున్న దాసి నొకనూతిలో ద్రోసి, నిద్రలో నున్నతనభార్యను మరియొక నూతిలో బడవైచి తన త్రోవ నేగెను. చంద్రిక నూతిలో బడి రోదనము చేయుచు తెల్లవారు వరకా నూతిలో నుండెను. ప్రాతఃకాలమున నాత్రోవ నొకబాటసారి పోవుచు నూతులోనుండి రోదనధ్వని విని తొంగిచూడ చంద్రిక కన పడెను. వెంటనే దిగి యామెను పైకి దీసికొనివచ్చి నీ వెవ్వరవు? ఈ నూతిలో నెట్లు పడితివి? అని యడుగ నామె యిట్లనియె. నేను హేమ గుప్తుండను వర్తకుని కుమార్తెను. నాభర్తతో నత్తవారింటికి బోవు చుంటిని. త్రోవలో దొంగలు వచ్చి నాపరిచారికను జంపి, నానగలను హరించి యీనూతిలో ద్రోసినారు. నాభర్త జాడ యే మయ్యెనో నాకు దెలియదు. అని చెప్పెను. అంతియేగాని మానవతి యగుచంద్రిక భర్త చేసిన దుర్మార్గమును వెల్లడింపలేదు. ఆబాటసారి జాలిపడి చంద్రిక నామె పుట్టినయింట నప్పగించి వెడలిపోయెను. హేమగుప్తు డాశ్చర్యపడి కుమార్తెను జూచి జరిగినవృత్తాంత మే మని యడుగ చంద్రిక బాటసారికి జెప్పినవిధముగ అరణ్యములో దొంగలు నాభర్తను బంధించుకొనిపోవుచు మమ్మిరువురను నూతులో ద్రోసినారు. నాభర్త గతి యే మయ్యెనో తెలియ లే దని చెప్పెను. గాని భర్త చేసినదుర్మార్గమును తండ్రితో చెప్ప లేదు. హేమగుప్తు డామె నూరడించి నీభర్తను వెదకించి పిలుపింతునని చెప్పెను. కుమార్తెకు తిరిగి యాభరణముల జేయించెను. ఆదుర్మార్గు డైన చంద్రికభర్త యాభరణములను గొని తనయూరుజేరి కొంతకాలము వేశ్యా - ద్యూత - మద్యపానాదులలో మునింగి తేలెను. ఆద్రవ్యము పూర్తియయ్యెను. మరల తిండికి గతిలేనివాడై దారి యేమా యని తలంచి మరల భార్య నెటైన మోసగించి ద్రవ్యమును సంగ్రహింపవల

యు నని నిశ్చయించి కతిపయదినముల కత్త వారింటికి జేరెను. కాని లోనికి బోవ శంకించుచుండెను. తనఘాతుకకృత్యము మామగారికి తెలిసి యుండును. అందువలన వా రేమైన నిందింతు రనుసంశయముతో వీధి లో నిల్చుండెను. చంద్రిక భర్తను జూచి గుర్తించి చేయి పట్టుకొని లోనికిం గొంపోయి తనగదిలోఁ గూర్చుండబెట్టి యిట్లనియె. నాధా! భయపడకుడు. దొంగలవలన బాధింపబడితి మని నాతండ్రితో జెప్పితిని. మి మ్మడిగినచో దొంగలు నగలను దీసికొని నన్ను వదలి రని చెప్పుడు. అని చెప్పి వానిభయము దీర్చి తనపతి వచ్చెనని తల్లితో చెప్పెను. అందరును చాల సంతసించిరి. మామగారు జామాత నెంతయో యాద రించి యింట నుంచుకొనెను. కొంతకాల ముండిన తదుపరి యాపాపా త్ము డొకనాడు చంద్రిక తననగలను ధరించుకొని పట్టుచీర గట్టుకొని తనభర్త దగ్గరకు వచ్చెను. రాత్రి గాఢనిద్రలో నున్నసమయమున మెల్లగ లేచి రహస్యముగ దాచినబాకును దీసి దయలేక గుండెలలో పొడిచి బలవంతముగ జంపి యానగల నన్నింటిని దీసికొని యర్ధరాత్రమున బారి పోయెను. మహారాజా! ఇది నేను కంటితో చూచిన సంగతి. అందువలన పురుషజాతియన్న నా కసహ్యము. అంతకృతఘ్నులు గనుక పురుషుల యందు నాకు నమ్మకము లేదు అనెను.

మైనా యీవిధముగ చెప్పి యూరకుండెను. కీర్తికేతుడు శుక మును జూచి కీరరాజమా! శారిక చెప్పిన వృత్తాంతమును వింటివిగదా! ఇందులకు నీ వేమి చెప్పెద వన నా చిలుక యిట్లనియె. మహారాజా! స్త్రీలు దుష్టబుద్ధిగలవారని దెల్పుట కొక యుదాహరణమును వచించు చుంటిని వినుడు. కంచనపురమను నగరము కలదు. ఆపురమున సాగర దత్తుడను వర్తకుడు గలడు. అతనికి శ్రీదత్తుడను కుమారుడు గలడు. ఆశ్రీదత్తుడు విజయపురనివాసియైన సోమదత్తు డనువానికుమార్తెయగు

జయశ్రీ యనునామెను పెండ్లియాడెను. వివాహమైన కొలదిదినముల కాశ్రీదత్తుడు వ్యాపారమునిమిత్తమై పరదేశములకు బోయి పదురెండు వత్సరములైనను తిరిగి రాలేదు. తల్లిదండ్రుల దగ్గరనున్న జయశ్రీ యౌవ్వనవతియై పతిసమాగమమున కెదురుచూచి విసిగిపోయెను. ఒక నాడు చెలికత్తెను పిలిచి రహస్యముగ నిట్లనియె. చెలీ! నన్ను విరహ తాపము వేధించుచున్నది. ఈకామబాధ మిక్కుటముగా నున్నది. తాళ జాల కుంటిని. నూర్గమేమియున నాచెలికత్తె యిట్లనియె. అమ్మా! విచారపడకుము. శీఘ్రకాలములో పరమేశ్వరానుగ్రహమువలన నీపతి రాగలడు. అప్పుడు నీవాంఛలు తీఱగలవు. అని పలుక నామాటలను జెడచెవిని బెట్టి చెలికత్తెతో మేడమీదకు బోయి రాజమార్గమున వచ్చుచు బోవుచున్నవారిం జూచుచు నిలువబడెను. తత్సమయమున నొకనవయువ్వనుడు దివ్యాంబరంబుల ధరించి యొయ్యారముగ రాజ మార్గమునుండి వచ్చుచుండుటను జయశ్రీ చూచి యాయువకునిపై తనమనస్సు లగ్నమగుటచే రెప్పవాల్పక చూచుచుండెను. ఆనవయువ కుడును సోమదత్తుని మేడక్రిందకు వచ్చి తలయెత్తి చూడ జయశ్రీ తన్ను నిదానించి చూచుచున్నట్లు తెలుసుకొనెను. ఇర్వురి వీక్షణములు లగ్నములైనవి. జయశ్రీ చెలికత్తెను జూచి సఖీ! ఆపోవుచున్న వయసుకా డెంత యందముగ నున్నాడో చూచితివా? వానితో పొందును నాకు సమకూర్చుము. లేకున్న నాప్రాణములు నిలువవు. అని పలుక నాచెలి వెంటనే క్రిందకు దిగి నాయువకుని గలిసికొని చేసన్నచే తన యింటికిం గొంపోయి సోమదత్తుని తనయ నీపొందుగోరి పరితపించుచున్నది. నీవు రేపురాత్రికి నాయింటికి రమ్ము. అని చెప్ప నాత డానందముతో వెడలి పోయెను. చెలికత్తెయు జయశ్రీ కావార్త నెఱింగించి కాలమును దెలి పెను. మరునాటిరాత్రి చీకటి పడినతోడనే యా యువకు డాచెలికత్తె యింటికి జేరెను. వాని నింట నుండుమని చెప్పి యాలేమ జయశ్రీకడ

కేగి రహస్యముగ నీప్రియుడు వచ్చెనని యెరింగింప నాపడతి పట్టజాలని యానందమూతో నలంకరించుకొని యందరు నిద్రించినవెనుక చెలికత్తె సాయమున మెల్లగ తలుపు తెరచుకొని గమ్యస్థానముం జేరెను. చెలికత్తె వారి నిర్వురను గదిలోని కనిపి తాను ద్వారమున భద్రముగ బరుండెను. జయశ్రీ యారాత్రియంతయు నాయువకునితో కేళీవిలాసముల గడపి తెల్లవారుఝామున లేచి చెలికత్తె సాయమున నింటికి జేరెను. ఆయువకుడును ప్రాతఃకాలమున లేచి తనయింటి కేగెను. ఈవిధముగ కొన్ని దినములవరకు వారిర్వురకును రహస్యసమావేశము జరిగెను. చెలికత్తెయు వారిరహస్యమును గాపాడుచుండెను.

ఒకనాడామెభర్తయైన శ్రీవత్తు విదేశములనుండి బయలుదేరి యత్తవారింటికి వచ్చెను. భర్తను జూడగనే జయశ్రీకి గుండెలలో రాయి పడెను. అన్నము రుచికరముగ లేకపోయెను. రహస్యముగ చెలికత్తెను బిలిచి సఖీ! ఏమిచేయుదును. నాదురదృష్టము నేడు ప్రత్యక్షమైనది. నేడు నాసుఖమున కాటంకము గల్గినది. అని చెప్పుచు నామెవలన తనప్రియునకు వార్త నంపెను. నాటిరాత్రి తలిదండ్రు లామెను శృంగారించి యల్లుడు పరున్నగదిలోనికి బంపిరి. కాని జయశ్రీ భర్తను జూచి సంతోషింపలేదు. మాటాడలేదు. భర్త తనకొఱకు దెచ్చిన కానుకలనైన కంటజూడక పరుండెను. శ్రీదత్తుడు ప్రాణమువిసిగి క్రొత్తయగుట సిగ్గుపడిన దేమో యని తలంచి ప్రయాణముచే బడలి యుండుటచే పరుండెను. వెంటనే నిద్రపట్టెను. సమయమునకై వేచియున్న జయశ్రీ మెల్లగ లేచి భర్త గాఢనిద్రలో నుండు టెరింగి మెల్లగ లేచి తన ప్రియునికొఱకు చెలికత్తెయింటికి బయలుదేరెను. మార్గములో నొక దొంగ జయశ్రీని జూచి యీమె యెవ్వరు? నగలను ధరించి యర్ధరాత్రమున బోవుచున్నది. ఈరహస్య మేమో తెలిసికొనవలయు నని

తలంచి యామెను వెన్నంటెను. జయశ్రీ తన చెలికత్తె యింటిముందున కేగునప్పటి కామెప్రియు డంతకుముందే ప్రియురాలికొఱకు వచ్చుచు గుమ్మములో కాలుపెట్టగనే యొకత్రాచుపా మటనుండి కాటు వేసెను. వెంటనే వా డాయరుగుమీదనే పరుండి ప్రాణములను విడిచెను. జయశ్రీ మెట్లు దాటి యరుగుమీదనున్న ప్రియుని కళేబరమును జూచి నిద్రించు చున్నాడని తలంచి పట్టరానిమోహమున వానిపై బడి ముద్దు పెట్టుకొను చుండెను. చోరుడు రహస్యముగ దాగి యీయామె కార్యక్రమమును గని పెట్టుచుండెను. మరియును ప్రాంతమందొక మఱ్ఱిచెట్టుపై నున్నబ్రహ్మ రాక్షసుడు జయశ్రీ చేయుపనిని జూచి యామెతో భోగింపవలయునని తలంచి పరకాయవిద్యచే నామెప్రియుని శరీరములో ప్రవేశించి యామె తో సురతక్రీడల దేలి చివరకు ముద్దుబెట్టుకొనబోయి యామెముక్కును పూర్తిగ కరచి చెట్టుమీదకు బోయెను. జయశ్రీ బాధచే నేడ్చుచు చెలికత్తెను పిలిచి యామెతో జరిగిన సంగతి యంతయు నెఱింగింప నా చెలి నీవు సత్వర మింటికి బోయి యీకార్యమును నీభర్తపై మోపు మని చెప్పి పంపెను. జయశ్రీ శీఘ్రమే బయలుదేరి యింటికి వచ్చి భర్తగదిలో బ్రవేశించి వెక్కివెక్కి రోదనము జేయ నారంభించెను. ఆరోదనమును విని తల్లిదండ్రులు మొదలగువా రాగదిలోనికి వచ్చిరి. చూడ కుమార్తె ముక్కు కోయబడియుండెను. కారణ మడుగ నామె తనభర్తయే యిట్లు కోసెనని వచించెను. అం దున్నవారంద రాతని నిం దింప నారంభించిరి. భర్తయైన శ్రీదత్తు డిది యంతయు చూచి తెల్ల బోయి ఆహా! స్త్రీ లెంతసాహసులు? అందువలననే చంచలయైన యువ తిని - కృష్ణసర్పమును - ఆయుధమును ధరించిన విరోధిని - విశ్వసింపరా దని గ్రంథములు వచించుచున్నవి. అని యెంచి తనపై వచ్చిన యపవాద మునకు జింతింప నారంభించెను.

సోమదత్తుడు కొత్వాలును బిల్చి యల్లుడు చేసినపనిని వివరించి యాతని కప్పగించెను. కొత్వా లాతని బంధించి రాజసమ్ముఖమునకు దోడ్కొనిపోయి సర్వము విన్నవించెను. రాజు శ్రీదత్తుని యడుగగా నాతడు దేవా! నే నేమియు నెరుగ ననెను. జయశ్రీ నడుగ మహారాజా! ఒక్కగదిలో పరుంటిమి. నాముక్కు నతడు గాకున్న నిం కెవరు గోయుదురు? న్యాయము దయచేయు డని యేడ్చెను. సాక్ష్యబలమునుబట్టి ప్రభువు శ్రీదత్తునకు శూలారోపణశిక్ష విధించెను. భటు లాతని శూల ముకడకు గొంపోయిరి. ఇదంతయు జూచుచున్న చోరుడు తెల్లబోయి నిష్కారణముగ నిరపరాధి దండింపబడుచుండె నని తలంచి భటులను సమీపించి అన్యాయ మని మొఱపెట్టెను. భటు లాచోరుని రాజసముఖమునకు గొనిపోయి నిలువబెట్టిరి. ప్రభువు వానిం జూచి నీ వెవ్వడవు? ఇం దన్యాయ మేమి? అని యడుగ చోరు డిట్లనియె. దేవా! ఇతడు నిరపరాధి. తాము నిర్దోషిక శిక్ష విధించినారు. ఇది అన్యాయము కాదా? యన రాజు నిర్దోషియగు నని యెట్లెరుంగుదువని యడుగ చోరుడు స్వామీ! ఈతడు తనభార్యముక్కును గదిలో కోసియుండునుగదా! ఆకోయబడిన ముక్కును తెమ్మని యాజ్ఞాపింపు డని చెప్పెను. రాజు సోమదత్తునితో కోసినముక్కును తెమ్మని బంపెను. కాని యెంత వెదకినను కానరాలేదు. ఊరక వచ్చెను. చోరుడు రాజుం జూచి మహారాజా! ఆముక్కును నేను చూపెదను రండని వెంట గొనిపోయి చెలికత్తె యింటి కేగి యాకళేబరము నోటిలో నిరుకుకొనిన ముక్కును జూపి రాత్రి జరిగిన చరిత్రమును వివరించెను. ప్రభువు యదార్థమును తెలుసుకొని శ్రీదత్తుని వదలి నిజమును గ్రహించిన చోరునకు బహుమతి నొసంగి పంపివేసెను. పిమ్మట జయశ్రీని బిలిపించి గాడిదపై నెక్కించి యూరేగించెను. విక్రమార్క మహారాజా! శుకశారికలు చెప్పినకథలు వింటివిగదా! పురుషుడు దుర్మార్గుడా? స్త్రీ దుర్మార్గురాలా నిర్ణయింపు మన విక్రముడు స్త్రీలే దుష్టు

రాండవాని చెప్పెను. కారణ మేమనగా పురుషుడు దుర్మార్గమున బడినను తగిన శిక్ష యుండినచో కొంతకాలమునకు మరలును. ఆడుది పెడమార్గమున కాలుపెట్టినదా? బ్రహ్మయైన నామెను మంచిమార్గమునకు దిప్ప జాలడు. కావున శుకము చెప్పినదే యదార్థము. అని చెప్ప భేతాళుడు తటాలున నెగిరి చెట్టుకొమ్మను వ్రేలాడుచుండెను.

## అయిదవకథ.

భేతాళుడు విక్రమునితో నైదవకథను చెప్ప నారంభించెను. ఉజ్జయని యనునగరమున మహాబలు డనుపేరుగల రాజు రాజ్యము సేయుచుండెను. ఆరాజుదగ్గిర హరిదాసను పేరుగల యుద్యోగి కలడు. ఆయుద్యోగికి మహాదేవి యనుపేరుగల కుమార్తె యుండెను. ఆమె మిగుల సుందరియు, విద్యావతియు నై యుండెను. వివాహోచితవయస్కయైనంతనే తండ్రి వరాన్వేషణము జేయుచుండ నొకదినమున కుమార్తె వచ్చి తండ్రీ! నేను సకలవిద్యాసంపన్నుడు, సద్గుణవంతుడునగు వరుని పెండ్లాడెద నని చెప్పెను. తండ్రియు నామెమాటల నంగీకరించి యట్టివానికై వెదకుచుండెను. ఒకనాడు ప్రభువు హరిదాసును బిలిచి దూరదేశమందున్న తనమిత్రుడైన మరియొకప్రభువు కుశలవార్తను తెలిసికొని రమ్మని పంపెను. హరిదాసు రాజాజ్ఞచొప్పున నాదేశమునకు బోయి యారాజునకు దనస్వామి పంపినసందేశ మెఱింగించి యతనియనుమతిని కొన్నిదినము లట నుండెను. ఇంతలో నొకదినమున బ్రాహ్మణు డొక్కడు హరిదాసును సమీపించి నీ కొకవిద్యావతియైన కుమార్తె యున్నదని వింటిని. ఆమెను నా కొసంగుము. అని యడుగ హరిదాసు అతనికి తన పుత్రికసంకల్పము నెఱింగించెను. బ్రాహ్మణుడు హరిదాసుతో నేను సకలవిద్యలు- అరువదినాలుకళలు- నేర్చి యుంటినని చెప్పెను. అందుల కాహరిదాసు బ్రాహ్మణోత్తమా! నీవిద్యాప్రభావము జూపెదవా యన

నత ఃొకరథమును గొనివచ్చి హరిదాసునకు జూపి దీనిని నేను తయారు చేసితిని. దీనిప్రభావ మేమనగా ఇందు గూర్చుండి యెచ్చటికి బోవలయున న్నను పోవచ్చు నని చెప్పెను. హరిదా సావిప్రునిగూడ వెంట నిడుకొని రథమున గూర్చుండి ఉజ్జయనికి బోవలయునని తలంచినంతనే యారథము విచిత్రముగ దృటికాలములో వారి నిర్వుర నుజ్జయనిలో గమ్యస్థానమున జేర్చెను. వీ రిర్వురును జేరకముందే హరిదాసుగృహమున నొకచిత్రము జరిగెను. ఏమనగా ఒకబ్రాహ్మణుడు హరిదాసుయొక్క పెద్దకుమారుని జూచి నేను సకలకళలు తెలిసినవాడను. నాకు నీసహోదరి నిచ్చి పెండ్లి చేయు మన నాతడు సరే యని యంగీకరించెను. వీరికి తెలియకుండ మరి యొకబ్రాహ్మణుడు హరిదాసుభార్యను జూచి నేను సకలవిద్యలయం దారితేరినవాడను. నాకు నీకుమార్తె నిచ్చి పెండ్లిచేయుమన నామె సరే యని యంగీకరించెను. ఈవిధముగ హరిదాసు బ్రాహ్మణునితో నిల్లుజే రునప్పటి కిర్వురు వరు లధికముగ సిద్ధపడుటచే నొకకన్యను ముగ్గుర కిచ్చు టెట్లా యని తలపోయుచుండ నాటిరాత్రి యొకరాక్షసు డామ హాదేవిరూపమును జూచి మోహితుడై యపహరించుకొని వింధ్యాద్రిపై నివసించెను. తెల్లవారుజామున లేచి తల్లి, తండ్రి, సోదరుడు మొదలగు వారు మహాదేవికొరకు వెదుకగా నామె యెచ్చటను గాన రాలేదు. అనేకప్రదేశములలో వెదకిరి. ఊరంతయు తిరిగినను కానరాకపోవుటచే చింతాక్రాంతులై యామెకై కన్నీరు విడుచుచుండిరి. హరిదాసు కన్యార్థమై వచ్చిన వీరులను జూచి అయ్యలారా! మీరు సకలవిద్యాపారం గతులు. నాకుమార్తె యెచ్చటనున్నదో వచింపు డనగా వారిలో సోద రునిచే నియమింపబడిన వరుడు అయ్యా! నేను త్రికాలవేదిని. మీసంశ యము బాపెదనని చెప్పి కూర్చుండి ధ్యానదృష్టిచే తెలిసికొని హరి దాసూ! నీకుమార్తెను రాక్షసు డొక డపహరించుకొనిపోయి వింధ్యాద్రి పై నుంచెనని చెప్పెను. వెంటనే హరిదాసుచే నియమింపబడిన వీరుడు

ముందునకు వచ్చి నారథముపై గూర్చుండిన సత్వర మట చేరగల మని నుడివెను. తల్లిచే నియమింపబడిన వరుడు హరిదాసుం జూచి నేను యుద్ధవిద్యలో ప్రవీణుడను. ధనుర్యుద్ధము, ఖడ్గయుద్ధము రెండును చేయ గల నని వచించెను. వెంటనే యాముగ్గురును వింధ్యాచలమున రాక్షసు డుండు ప్రదేశమున కేగి యాదైత్యుని పారదోలి మహాదేవిని స్వస్థాన మునకు జేర్చిరి. అటుపిమ్మట నాముగ్గురును కన్యకొరకు కలహింప నారం భించిరి. తండ్రియైన హరిదాసుకూడ కూతు నెవ్వని కిత్తునా యని యా లోచింప దొడంగెను. విక్రమార్క మహారాజా! ఆముగ్గురిలో కన్యకు భర్తగా నుండదగినవా డెవ్వడో దెల్పుమన విక్రముడు యోజించి రాక్షసుని సంహరించినవాడే భర్త యని వచించెను. భేతాళు డతనిం జూచి జ్ఞాని నచించకున్న నామొజాడ తెలియదు. రథము లేకున్న వా రచ్చటికి పోజాలరు. వీరుడు లేకున్న దైత్యుని జయింపజాలరు. వీరిలో నెవ్వరివిద్య తక్కువైనది? అని యడుగ విక్రము డో భూతరాజా! విను ము. నీవు చెప్పినమూడును సమానములే- కాని రాక్షసుని జయించిన వీరుడు ప్రధాన కారణము. తక్కువా రిరువురు నతనికి సహకారకారణ ములు. కావున జయించినవాడే యాకన్యను బరిగ్రహింప నర్హుడని వచింప భేతాళుడు యథాప్రకార మెగిరి వృక్షశాఖను తలక్రిందుగ వ్రేలాడ నారంభించెను.

# ఆరవకథ.

మరల విక్రముడు భేతాళుని బట్టి తెచ్చుచుండ నత డిట్లు చెప్ప నారంభించెను. రాజా! వినుము. ధర్మపుర మనుగొప్పపట్టణము గలదు. ఆపురమును ధర్మాత్ముడైన రత్నవర్మ యనురాజు పాలించుచుండెను. అంధకు డనుపేరుగల మంత్రిసాహాయ్యమున నాప్రభువు రాజ్యమును న్యాయబుద్ధితో పాలింపుచుండెను. ఒకనాడు మంత్రి ప్రభువుసన్నిధిం జేర

మహారాజా! దేవతలలో నెల్ల దుర్గాదేవి మహామహిమ గలది. వాంఛితార్థములనిచ్చు లోకజనని. ఆదేవి కొకదేవాలయము గట్టించి నిత్యము షోడశోపచారములచే పూజించినయెడల గొప్పపుణ్యము గల్గును. అని చెప్పగా రత్నవర్మ మంత్రి చెప్పినట్లు చక్కని దేవాలయమును గట్టించి యొకశుభలగ్నమున దుర్గామాత నందు బ్రతిష్ఠించి పరమభక్తితో బ్రతిదినము పూజించుచుండెను. కొంతకాలము జరిగినపిమ్మట సంతానహీనుడైన యారాజు దుర్గాదేవి సన్నిధిం జేరి సాష్టాంగనమస్కార మాచరించి తల్లీ! లోకమాతా! నీవు సర్వమంగళవు. బ్రహ్మ విష్ణు మహేశ్వరులకు గూడ పూజనీయవు. మహిషాసుర - భాండాసుర - రక్తబీజాదిదానవులను బరిమార్చి భూభారమును దీర్చిన మహామహిమోపేతవు. తల్లీ! నీ వాశ్రితభక్తజనకల్పలతికవు. దాసుడనైన నావాంఛను దీర్పుము. అని వినుతింప నాదేవాలయమునుండి రాజా! నీభక్తికి మెచ్చితిని. నీ కభీష్టమగువరము నిచ్చెద కోరుకొనుమని యడుగ నారాజు జగజ్జననీ! పుత్రులు లేనివానికి గతు లుండవు. వర్గత్రయము తరించుటకు పుత్రనొకయే ప్రధానసాధనము కావున నొక్కసుపుత్రు నను గ్రహింపు మని వేడ నాదేవి రాజా! నీకోర్కె నెఱవేఱును. మహాప్రతాపశిరోమణియగు పుత్రుడు జనించును. అని వర మొసగెను. రత్నవర్మ మహానందభరితుడై నిత్యమతిభక్తితో దేవీపూజ యొనర్చుచుండ కొంతకాలమున కామహాదేవీ ప్రసాదమువలన రత్నవర్మభార్య గర్భవతియై పదవనెలలో సుపుత్రుని గనెను. రత్నవర్మ మహానందభరితుడై పుత్రోత్సవము నతివైభవముగ జేసి దుర్గాదేవి కుత్సవములు పూజలు జేయించెను.

కొంతకాలమైనతదుపరి ధర్మపురవాసియైన చాకలి యొకడు తన స్నేహితులతో గలసి త్రోవను బోవుచు నట నున్నదుర్గామందిరమును జూచి నమస్కరింపవలయునని లోని కేగెను. అంతకు ముందే పొరుగూరి

లోనున్న రజకకన్యామణి యొకర్తుక దేవీదర్శనమునకు వచ్చి యుండుటచే చాకలి యాసుందరిని జూచి మోహించి యింటి కేగెను.

పోవుసమయమున దుర్గకు మ్రొక్కి తల్లీ! ఈసుందరిని నాకు భార్యగా జేసితివేని నాశిరమును నీకు కానుకగా నర్పింతు నని పల్కి యింటి కేగెను. అదిమొదలు నాకన్యకపై మోహముచే విరహపీడితుడై యుండెను. వాని తల్లిదండ్రులు కుమారుని మనోవ్యథకు గారణము తెలిసికొనజాలక చింతించుచుండ మిత్రుడు వచ్చి నాటివృత్తాంతము నెఱిం గించి మీ రాకన్యకను దెచ్చి యతనికి బెండ్లి చేయనియెడల జీవించుట దుర్ఘటము అని చెప్పెను. వెంటనే తండ్రి యాకన్యకయొక్క గ్రామ మును తెలిసికొని యాయూరి కేగి యాసుందరియొక్క తండ్రిని జూచి తాము వచ్చినవృత్తాంతమును దెలిపి నాకుమారునకు నీకుమార్తె నీయు మని యడిగెను. వాడును తనకూతురువలన విషయమును దెలిసికొని యున్నవా డగుటచే యందుల కంగీకరించి శుభలగ్నమునకు తరలి రండని పల్కెను. అని చెప్ప వా డింటి కేగి బ్రాహ్మణులవలన శుభలగ్నమును నిశ్చయించి యానాటికి బంధువులతో కుమారుని వెంటబెట్టుకొని ఆయూరి కేగెను. ఆకన్యదాతయు వీరి నెదుర్కొని కలిగినంతలో లోపము లేకుండా తనకుమార్తె నిచ్చి కన్యాదానము జేసి పెండ్లిచేసెను. వివాహానంతరము వియ్యంకునకు, అల్లునకు బహుమతు లిచ్చి కూతునకు సారెచీరల నిచ్చి యల్లునివెంట నత్తవారింటి కనిపెను.

కొంతకాలమువరకు రజకదంపతులు సంతోషముతో కాలము గడి పిరి. ఒకనాడు చాకలి మామగారియింట శుభకార్యము జరుగుచుండుట చే యాహ్వానింపబడి సఖునితో, భార్యతో గూడి యత్తవారింటికి బోవు చుండ త్రోవలో దుర్గాలయము కనబడెను. వెంటనే యతనికి తా నా డినమున మ్రొక్కుకున్న సంగతి జ్ఞప్తికి వచ్చుటచే అయ్యో! నేనెంత

యసత్యవాదిని. దేవతాసముఖమున జేసిన వాగ్దానమును దీర్చజాలక పో యితిని. అట్లొనర్చుట మహాపాతకమని తలంచి వెంటనే మిత్రుని జూచి సఖా! నీ వీమెను చూచుచుండుము. నేను దేవీ దర్శనము జేసి వచ్చె దను. అని చెప్పి సరోవరములో స్నానము జేసి దుర్గాదేవియెదుట నిలిచి నమస్కరించి తల్లీ! ఇదే నావాగ్దానము చెల్లించుకొనుచుంటిని. అని ప ల్కుచు ఖడ్గము నెత్తి యొక్కవేటున శిరమును ఖండించుకొనెను. మొం డెమునుండి శిరము వేరై పడెను. వెలుపలనున్న మిత్రుడు కొంతసేపు నిరీక్షించి తనస్నేహితుడు రా లేదని దేవిమందిరములోనికి బోయి చూడ చెలికాడు మరణించి యుండుట తెలిసికొనెను. మరియు నిట్లు తలపోసె ను. దేవి సమక్షమున తానొనర్చిన వాగ్దానమును చెల్లించుటకై నామి త్రుడు తనశిరమును కానుకగా సమర్పించెను. ఇట్టిసత్యవాదియైన మిత్రు నెడబాసి బ్రదుకుటకన్న మరణించుటయే మేలని యెంచి వెంటనే స్నాన మాడి దేవిముందు నిలిచి తనశిరమును ఖండించుకొని మిత్రుడు ప్రాణ ములను వదలెను.

వెలుపలనున్న భార్య తనభర్తయు నతనికొఱకేగిన మిత్రుడును చాలకాలమైనను రాకుండుటచే కారణమును తెలిసికొనవలయు నని దేవాలయములోని కేగి యిర్వురును తల తెగి పడియుండుట తెలిసికొని గుభాలున మూర్ఛబోయి కొంతవడికి తెలివి తెచ్చుకొని కటకటా! ఎంత ఘోరము. ఈహత్యల కెవరు కారకులు? ఏకాంతముగ నే నిచ్చోట నుండుటవలన నీహత్యలను జూచిన లోకు లేమని తలంతురు? ఈదుర్మా ర్గురాలు వ్యభిచారిణి యగుటచే తనకామవాంఛ కాటంక మని యెంచి వెంటనున్న మగనిని, వానిహితుని చంపినదని తలంచెదరు. ఈయపకీర్తి నెట్లు భరింతును. మరియును విధవనై జీవించుటకన్న మరణమే మేలని తలంచి యట పడియున్న ఖడ్గమును దీసికొని తన కంఠమును ఖండించుకొ

నబోవుచుండ నామె సాహసమునకు మెచ్చి దుర్గాదేవి యదృశ్యరూప మున నిట్లనియె. కుమారీ! నీపతిభక్తికిని, సాహసమునకును మెచ్చితిని. వరంబును వేడుమన తల్లీ! వీ రిర్వురిని బ్రతికింపుమని యడుగ నాదేవి యిట్లనియె. నీ వాశిరములను రెండింటిని కళేబరముల కంటింపు మని చెప్పెను. ఆమె యామాటను విని సంతోషముతో నొడలు తెలియక తొందరలో పతిశిరము మిత్రునికళేబరమునకును, మిత్రునిశిరము పతికళే బరమునకు నంటించెను. దుర్గాదేవి వా రిర్వురిపై యమృతవర్షమును గురిపింప వా రిర్వురు సజీవులై లేచి నిలువబడిరి. విక్రమార్కమహా రాజా! వా రిర్వురిలో నామెభర్త యెవరో తెల్పుమన విక్రము డిట్ల నియె. నదులలో గంగానదియు, పర్వతములలో మేరుపర్వతమును, వృక్ష ములలో కల్పవృక్షమును, అవయవములలో శిరస్సు ప్రధానములు, శ్రేష్ఠము లని శాస్త్రములు దెల్పుచున్నవి గాన పతిశిర మేకళేబరము నకు నుండెనో యతడే యామె భర్త యని నిర్ణయింప భేతాళు డెగిరి తరుశాఖను వ్రేలాడుచుండెను.

# ఏడవకథ.

భేతాళుడు మరల నిట్లు చెప్ప నారంభించెను. చంపాపురమనుపు రముకలదు. చంపకేశ్వరు డనురా జానగరమును బాలించుచుండెను. అత నికి సులోచన యనుభార్యయు- త్రిభువనసుందరి యనుపేరుగల కుమా ర్తెయు గలరు. త్రిభువనసుందరి యదార్థమునకు సార్థకనామము గలది. చంద్రబింబమును బోలిన ముఖము- తామరరేకులను బోలిన నేత్రములు- ధనస్సు ననుకరించు కనుబొమలు- దానిమ్మగింజల బోలిన పలువరుస- సింహామధ్యమును బోలిన నడుము- త్రాచును బోలిన జడ- పూర్ణిమనా టిచంద్రికవలె స్వచ్ఛమై, మనోహరమైయున్న నామెయవ్వనమున కెంత యు వన్నె దెచ్చుచుండెను. మరియు నాసుందరాంగియొక్క చక్కద

నము దేశము లన్నియు వ్యాపించుటచే పెక్కుమంది రాజు లామంద యానను భార్యగా బడయ దలంచి తమరూపపటములను చంపకేశ్వరుని కడ కంపిరి. అత డారూపపటములను తనకుమార్తెకు జూపి నీ కనుకూలుడగు వరు డెవరో తెల్పు మన నాత్రిభువనసుందరి చిత్రరువుల నన్నింటిని పరిశీలించి చూచి తండ్రితో నిట్లనియె. జనకా! నాకు వీరిలో నొక్కరును నచ్చలేదు. కారణ మేమనగా! వీ రందరికి నొకటియున్న నింకొకటి లేదు. రూపమున్న గుణమునున్న. గుణమున్న విద్యాశూన్యము. విద్యయున్న పరాక్రమము - క్షత్రియోచితపౌరుషములు లేవు. కావున నాకు రూప-బల - సుగుణ - విద్యా- జ్ఞాన సంపదలు గల భర్తయే కావలయు నని చెప్పెను. చంపకేశ్వరు డావిధముగ నలుదిక్కులకు జాటబంపెను. కొంతకాలమునకు నల్వురు రాజకుమారులు చంపకేశ్వరునికడ కరుదెంచిరి. రాజు వారిని గూర్చుండబెట్టి రాజపుత్రులారా! మీ కున్నయర్హతలను తెలియజేయు డని వచింప వారిలో నొక డిట్లనియె. రాజేంద్రా! మీరు కోరిన వన్నియు నాయందు గలవు. మరియు నితరులకడ లేని మరియొకవిశేషము కలదు. నే నొకవస్త్రమును నేసి వైదురత్నముల కమ్మెదను. వానిలో నొకటి బ్రాహ్మణున కిచ్చెదను. రెండవదానిని దేవున కిచ్చెదను. మూడవదానిని నేను గ్రహించి నాల్గువదానిని నాభార్య కిచ్చి అయిదవ దానితో కుటుంబమును పోషించెదను.

రెండవవా డిట్లనియె. నేను జలస్థలములయం దుండుపక్షిభాషల నన్నింటి నెఱుంగుదును. నాతో పోట్లాడగల బలశాలి లేడు. నారూపమును మీరు చూచుచున్నారుగదా యని వచించెను. మూడవవా డిట్లనియె. నేను సకలశాస్త్రములయందు ప్రావీణ్యము కలవాడను. నాతో వాదించువారు లేరు. సౌందర్యమున నాసంగతిని మీరు చూచుచున్నారని వచించెను. నాలుగవవాడు రాజేంద్రా! శస్త్రవిద్యలో నాకంటె

ఘును డెవ్వడును లేడు. శబ్దభేదిబాణములను బ్రయోగించుటలో నాకు నేనే సాటి యని చెప్పెను. చంపకేశ్వరు డానల్వురివాక్యములను విని తనకుమారిక నెవ్వరి కిచ్చుటకు దోచక త్రిభువనసుందరికడ కేగి యామెతో రాజపుత్రులవృత్తాంత మంతయును వివరించి పుత్రీ! వీరి నల్వురిలో నీ వెవరిని వరించితివో నా కెఱింగింపు మన నామె కొంతకాల మాలోచించి యేమియును దోచక సిగ్గుతో తలను వంచుకొనెను. విక్రమరాజేంద్రా! కథ యంతయును వింటివిగదా! ఆత్రిభువనసుందరి యీనల్వురిలో నెవరిని వరింప దగియున్నదో వచింపు మన విక్రమార్కు డిట్లనియె. బట్టలను నేసెదనని చెప్పిన రాకొమరుడు శూద్రతుల్యుడు. పక్షిభాషల నెరింగినవాడు వైశ్యతుల్యుడు. శాస్త్రవాదన చేయగలవాడు బ్రాహ్మణతుల్యుడు. ఇక ధనుర్విద్యలయందు నిపుణతగల యానాలుగవ రాజపుత్రుడే త్రిభువనసుందరికి భర్త కా దగినవా డని చెప్పగా భేతాళు డెగిరి మరల చెట్టుకొమ్మను వ్రేలాడుచుండెను.

# ఎనిమిదవకథ.

విక్రముడు పట్టి తెచ్చుచుండ భేతాళు డిట్లు చెప్ప నారంభించెను. మిథిలావతి యనునగరమున గుణాధిపు డనురాజు రాజ్యము జేయుచుండెను. ధర్మప్రభువని ప్రఖ్యాతి బడసెను. ఇట్లుండ నొకనాడు దూరదేశవాసియగు చిరదేవు డనుపేరుగల రాజపుత్రుడు గుణాధిపుని కొలువ నానగరమునకు వచ్చి ప్రతిదినము రాజసభకు బోవుచుండెను. కాని ప్రభుదర్శనముగాని, ప్రభువుతో మాట్లాడుటగాని లభింపలేదు. చిరదేవుడు తాను వెంట దెచ్చుకొనిన ద్రవ్యమైపోయినను కష్టమున జీవించుచు ప్రతిదినము రాజసభకు బోయి వచ్చుచుండెను.

ఒకనాడు రాజు పరివారసహితముగ వేటాడుటకై యరణ్యమున కేగెను. చిరదేవుడుగూడ గుఱ్ఱము నెక్కి రాజు ననుసరించి పోవుచుండెను.

అరణ్యములో కొంతకాలము వేటాడినపిదప దైవయోగమున గుణాధిపుడు తనపరిజనమునకు దూరుడై అరణ్యమున చాలదూరము పోయెను. పరివారముకూడ రాజును గనుగొనలేక నాతనికొఱకై వన మంతయు వెదకుచుండిరి. చిరదేవు డొక్కడు రాజును వెన్నంటి పోవుచుండెను. పోవపోవ రాజున కలసట వచ్చెను. తనపరివారము కానరా లేదని చింత పడుచుండ చిరదేవుడు సమీపించి మహారాజా! నే నొక్కడనే మీవెంట నుంటిని. మీపరివార మంతయు వెనుక జిక్కియున్నది. అని చెప్పగా గుణాధిపుడు వానిం జూచి నీ వెవ్వరవు? ఇట్లు చిక్కి బలహీనునివలె నుంటివి. కారణ మేమి? న న్నెందులకు వెంటాడుచుంటివి? అని యడుగ నత డిట్లనియె. రాజేంద్రా! నాది చాలదూరదేశము. కులమునకు రాజపుత్రుడను. పేరు చిరదేవుడు. నేటికి సుమారు సంవత్సరముక్రింద తమ కొలువు జేయ వచ్చితిని. ప్రతిదినము సభకు వచ్చుచుంటినిగాని నాదురదృష్టవశమున నేలినవారియనుగ్రహమునకు బాత్రుడను గాకబోయితిని. తమదృక్పథమున బడ నైతిని. వెంట గొనివచ్చిన ధన మైపోయినది. క్షత్రియుడ నగుట నితరులను యాచింపజాలను. దుర్భరముగ జీవితమును గడుపుచుంటిని. తమదర్శనముగోరి మీవెంట వచ్చితిని. ఇదియే నాచరిత్రము అని పలుకగా చిరదేవుని జూచి రాజు నా కాకలి యగుచున్నది. మార్గ మే మనగా? చిరదేవుడు మృగమాంసమును దెచ్చి అడవిపుల్లల నేరి ప్రోగుచేసి చెకుముకిరాతితో గొట్టి నిప్పు జేసెను. ఆయగ్నిహోత్రమున నామాంసమును పక్వ మొనర్చి రాజుముం దుంచెను. గుణాధిపు డామాంసమును భక్షించి యాకలి దీర్చుకొని నగరము జేరు టెట్లాయని తల పోయుచుండ చిరదేవుడు మార్గదర్శకుడై రాజును రాజధానికి జేర్చెను. ఆదినమున చిరదేవునివలన తాను పొందిన యుపకారమునకు సంతసించినవాడై గుణాధిపు డతనికి విశేషధనమును బహుమతి నొసంగి తన కొల్వులో నుద్యోగ మిచ్చి గౌరవించెను.

ఒకనాడు రాజు చిరదేవుని యొకకార్యమునకై సముద్రతీరమున కంపెను. చిరదేవుడు తురంగారూఢుడై పోయి సముద్రతీరము జేరి రాజకార్యము నెఱవేర్చి వచ్చుచు నటనున్న శివాలయమును జూచి లోని కేగి పరమేశ్వరుని పూజించి తిరిగి వచ్చుచుండ నతనికంటి కొకదివ్య సుందరి కన్పడెను. చిరదేవు డామెం జూచి మోహించి రెప్ప వాల్పక జూచుచుండెను. ఆసుందరి యతనిని సమీపించి నీ విచ్చటి కేల వచ్చితివి? నన్ను నిదానించి చూచుటకు గారణమేమి? అని యడుగ నత డోసుందరీ! నే నొక రాజకార్యముపై యిటకు వచ్చితిని. నీ సౌందర్యమును గాంచి ముగ్ధుడనైతిని. నీయాశ్లేషసుఖమును వాంఛించి చూచుచుంటి నని చెప్పెను. చిరదేవునివాక్యమును విని యామె చిరునవ్వు నవ్వుచు నోపురుషాగ్రణీ! ముందు నీ వాకొలనులో స్నానము జేసి రమ్ము. తదనంతరము నీయభీష్టము నెరవేరునని చెప్పెను. చిరదేవు డామాటలను నమ్మి గుఱ్ఱమునుండి దిగి యాకొలనులో మునిగి లేచి యొడ్డును జేరునప్పటి కతడు మిథిలానగరిలో నుండెను. చిరదేవు డాశ్చర్యమగ్నుడై యాసుందరి తన్ను మోసగించెనని తెలిసికొని రాజును సమీపించి జరిగిన వృత్తాంతమంతయు వచించి యిట్లనియె. మహారాజా! యాసుందరి నావంటిమంద భాగ్యునకు దగదు. దేవరవా రామెను జేపట్ట నగును. అని చెప్ప గుణాధిపుడు విస్మయపడి యావింత యేమో చూతము రమ్ము అని చిరదేవుని వెంట నిడుకొని సముద్రతీరమున కేగి యాశివాలయము జేరి విశ్రమించి యుండ మామూలువేళ కాసుందరి శివాలయమును జేరవచ్చి యట నున్న గుణాధిపునిం జూచి యతనిని మోహించి యోరచూపుల జూచుచు నిలువబడెను. రా జామెను జూచి సుందరీ! ఏల యట్లు నిలువబడితివి? అని యడుగ నామె రాజేంద్రా! నీరూపమును జూచి నిన్ను వలచితిని. నీయాజ్ఞకు విధేయురాలనై యుందును. వచింపు మన నత డోకాంతా! నిన్ను నాయాంతరంగిక సచివుడైన చిరదేవు వలచియున్నాడు. కాన నీవు

నాకు తగవు. ఇతడు సుక్షత్రియుడు, శూరుడు, యథార్థవాది, సద్గుణవంతుడు కావున నీ వాతని బరిణయ మాడు మని చెప్పి యామె నంగీకరింపజేసి వా రిర్వుర కాళికాలయములోనే పాణిగ్రహణము జేసెను. విక్రమార్క మహారాజా! వింటివిగదా! చిరదేవగుణాధిపులలో నెవరు త్యాగశీలులు? అని యడుగగా విక్రమార్కు డిట్లనియె. చిరదేవుడే త్యాగశీలుడు. కారణ మేమనగా తనసేవకుడు వలచిన కన్యను తా నపేక్షింపక నతనికే పరిణయము గావించి పరోపకార మొనర్చుట క్షత్రియుడగు ప్రభువునకు విధాయకధర్మము. అందులో గొప్పగ జెప్పుకొనవలసిన విషయ మేమియును లేదు. చిరదేవుడు తానువలచిన కన్య తన కలభ్యయని తెలిసికొని తనకు లేకున్నను తన ప్రభువున కామె సమకూర్పదలంచినాడు. ఇది సర్వోత్కృష్టమైన త్యాగము. కావున చిరదేవుడే త్యాగశీలుడు. అని చెప్పగా విని భేతాళుడు మరల నెగిరి వృక్షాగ్రమున వ్రేలాడుచుండెను.

## త్రొమ్మిదవకథ.

భేతాళు డిట్లనిచెప్ప నారంభించెను. రాజా వినుము. మదనపురమనునగరమును వీరవిక్రము డనురాజు పాలించుచుండెను. ఆపట్టణములో హిరణ్యగుప్తు డనువర్తకుడు గలడు. అతనికి మదనసేన యనునుమార్తె కలదు. ఆసుందరాంగి యొకనాడు తనస్నేహితురాండ్రతో గలసి యుద్యానవనమున విహరించుచుండెను. ఇంతలో నాతోటలోనికి ధనికుడైన ధర్మదత్తుడను వైశ్యునికుమారుడు సోమదత్తుడు నవయవ్వనుడు షికారుగ వచ్చెను. మదనసేన కొంతకాలము విహరించి యింటికి బోవుచు నటనున్న సోమదత్తుని జూచెను. అతడును మదనసేనం జూచెను. ఇర్వురి వీక్షణములు లగ్నము లయ్యెను. పరస్పరవీక్షణములవలన వారిర్వురును మోహాక్రాంతులైరి. సోమదత్తుడు నిలువజాలక మదనసేనను

సమీపించి యోకాంతామణీ! నిన్ను జూచినదిమొదలు మదనుడు పుష్ప బాణములచే వేధించుచున్నాడు. నామోహాగ్నిని నీవు చల్లార్పవేని నా ప్రాణములు నిలువవు. అని పలుకగా మదనసేన యిట్లనియె. సుందరుడా! నీ వట్లనవలదు. నాహృదయమునకు జాలపరితాపముకల్గును. నేనును నీసౌందర్యమును గాంచి నిలుపజాలని తమిచేత వేగుచుంటిని. కాని ప్రస్తుతము నేను నీకోర్కె దీర్పజాలను. కారణ మే మనగా నా కైదుదినములలో వివాహము జేయుదురు. పెండ్లియైన తదుపరి నాయత్తమామలు నన్ను గొంపోయెదరు. నేను నాభర్తతో గలసికొనుటకై పోవుటకు ముందే నీవాంఛను దీర్చి నాపతిని జేరుదును. ఇది నిశ్చయ మని చెప్పి తనత్రోవను బోయెను.

అయిదవనాడు మదనసేనవివాహము జరిగెను. వివాహము పూర్తియైన తదుపరి అత్తమామలు మదనసేనను తమయింటికి గొనిపోయిరి. కొన్నిదినములు జరిగినతరువాత మంచిదినము చూచి మదనసేనకు పునస్సంధానమును జరిపిరి. రాత్రి స్నేహితురాం డ్రందరును గలసి దంపతుల నేకము జేసి గదితలుపులు వేసి వెడలిపోయిరి. అందరును నిద్రించిన తదుపరి భర్త నవోఢయైన మదనసేనను చేయిపట్టి లాగి పాన్పుపై గూర్చుండబెట్టుకొని కౌగిలించుకొనబోవ మదనసేన తప్పించుకొని భర్తతో మున్ను తాను సోమదత్తున కిచ్చిన వాగ్దానము నెఱింగించి యాడిన మాటలు తప్పిన దోషము కావున సోమదత్తునికడకు బోయి వచ్చుటకనుమతి నొసంగవలయు నని యడిగెను. భర్త యామెం గాంచి నీవు నీవాగ్దానమునకు భంగ మొనర్చుకొనవలదు. తప్పక పోయి రమ్ము. అని యనుమతి నొసంగి యామెను బంపెను. మదనసేన సర్వాభరణములను ధరించి ప్రియుని జేరబోవుచుండెను. త్రోవలో నొకచోరుడు మదనసేనను జూచి నీ వెవ్వతెవు? ఇంతరాత్రివేళ నగలను ధరించి యెచ్చ

టికి బోవుచుంటివి? నిలువుము. నీయాభరణముల నన్నింటి నిటబెట్టి యావలి కేగు మన నామదనసేన ఓయీ! నాకు సాయము మదను డున్నాడు. అని పల్కి తన చరిత్ర యంతయు నెఱింగించి యోచోరా గ్రేసరా! నే నిప్పుడు పతియాజ్ఞను బొంది నాప్రియుని సంతృప్తి జేయ బోవుచుంటిని. నాశృంగారమును భంగము జేయకుము. నేను తిరిగి వచ్చునపుడు నీ కీనగ లన్నియు నిచ్చెద నని వాగ్దానము చేయుచుంటిని. నన్ను విడువుము. అని పలుక నాచోరుడు సమ్మతించి వదలెను. మదన సేన సోమదత్తునియింటి కేగి నిద్రలోనున్న యాతని మేల్కొల్పి ప్రియుడా! లెమ్ము. అని పల్కెను. సోమదత్తుడు మేల్కొని కన్నులు నలుపు కొనుచు కట్టెదుట నిలిచిన యాసుందరిం జూచి నీవు దేవకన్యకవా? నాగ కన్యకవా! యక్షకన్యకవా! ఎవ్వతెవు? అని యడుగ నామె నే నెవ్వ తెను కాను. హిరణ్యగుప్తునికుమార్తెను. నాపేరు మదనసేన. నాడు వన ములో నీకు నేను వాగ్దాన మొసంగితిని. వివాహితుడైన భర్తతో కలి యకముందు నీకోర్కె దీర్తునని పల్కితిని. మాటప్రకార మరుగుదెంచి తిని. నీవాంఛితము నెఱవేర్చుకొనుము. అని పలుక నతడు తెల్లబోయి యోసుందరీ! నీవు పతియాజ్ఞను బొందితివా యన నామె తలయూచి నాభర్త యంగీకరించియే నీకడ కంపెనని బల్క సోమదత్తుడు హృదయ మున నిట్లు తలపోసెను. ఆహా! స్త్రీలెంతకైన తగుదురు. వారుచేయజాలని కార్యములు లేవు. ప్రపంచకమున వస్త్రములు లేని నగలు- నేయిలేని భోజనము - స్వరహీనమైన సంగీతము - అనుకూలుడైన పతిలేని కాపు రము - దుర్భరము. మాసినబట్టలు తేజస్సును హరించును. దురన్నము బలమును హరించును. దుష్టభార్య పతిప్రాణముల దీయును. కుపుత్రుడు కులనాశకు డగును. అట్లనే పరస్త్రీసాంగత్యము ఇహపరముల రెండింటిని జెరచును. స్త్రీలు మనమున నున్నవిషయమును వచింపరు. వచించినట్లు క్రియలో గన్పరుపరు. భగవంతుడు స్త్రీలను విచిత్రముగ సృష్టించినాడు.

వీరిమాయలకు లోబడరాదు. అని తలంచి మదనసేనం జూచి కాంతామణీ! నీవు పరస్త్రీ వగుటచే నిన్ను స్పృశింపరాదు. పొమ్మని పల్కి యామెను పంపివేసెను. మదనసేన బయలుదేరి వచ్చుచు దనకొఱకై నిరీక్షించి యున్న చోరుని సమీపించి జరిగినవృత్తాంతము నెఱింగించి నగలు తీసి కొనుమని పల్కెను. ఆచోరు డీమె సత్యమునకు మెచ్చి తల్లీ! నీకు నమ స్కారము. నీవంటి మహాసాధ్వీమణుల కపకారము చేయఁజాలనని పల్కి యామెతో నింటివరకు వచ్చి వెడలిపోయెను. మదనసేన పతిం జేరి జరిగిన వృత్తాంత మంతయు దెలిపెను. ఆతడును రహస్యముగ వెంటనంటి జరిగిన వృత్తాంతమును చూచి యుండుటచే యట్టి సత్యనిష్ఠగలభార్యను కౌగ లించుకొని యాదరించెను. రాజా! వింటివా? ఈముగ్గురిలో నెవ్వ రధికు లో చెప్పుమన విక్రమార్కుడు చోరుడే యధికుడు. ఏమనగా భార్య యొక్క సత్యమును రక్షించుట భర్తకు ధర్మము. పరస్త్రీని వర్జించుట సోమదత్తునకు ధర్మము. కాని చౌర్యమే వృత్తిగా బెట్టుకొనిన యాదొంగ చేతి కందిన బంగారమును వదలుటయే గొప్ప యని వచింప భేతాళుడు తటాలున నెగిరి వృక్షశాఖను వ్రేలాడుచుండెను.

## పదవకథ.

విక్రమార్కుడు తిరిగి భేతాళుని కొనివచ్చుచుండ భేతాళు డిట్లు చెప్ప నారంభించెను. వర్ధమాన మనునగరమును గుణశేఖరు డనురాజు పాలించుచుండెను. ఆతనికి అభయచంద్రు డనుమంత్రి గలడు. ఆమంత్రి నాస్తికమతాభిమాని యగుటచే రాజునకు సమయము దొరకినప్పు డెల్ల తనయభిప్రాయములను బోధించుచు క్రమక్రమముగ దైవ గురుభక్తి శూ న్యుని గావించుచు సప్తవ్యసనములకు బాల్పడ జేయుచుండెను. ఒక నాడు రాజు విశ్రాంతిగా నున్నతరి మంత్రి ప్రక్కను జేరి రాజేంద్రా! ప్రపంచకమున పుట్టినట్టు సుఖానుభవముకొఱకే. పూజ లనియు నోము

లనియు- ధర్మము లనియు- దేవు డనియు- లేనిపోని శంకలను- తలంపులను బెట్టుకొని నిష్కారణముగ జీవితమును వ్యర్థము జేయుచుంటిమి. మన మనుభవించుచున్న సౌఖ్యములే మనకు స్వర్గసంపదలు. మరణించుటయే జీవన్ముక్తి. భగవంతు డింద్రియాత్మకమైన శరీరమును మన కొసంగినందుల కాయాకార్యములను నెఱవేర్చుచు నానందింపవలదా? కామ క్రోధాదులు శరీరము నాశ్రయించి యుండునవి. శరీరముతోనే పోవును. వానిని వదల్చుకొనుట మనతరము కాదు. కావున దేవరవారు నేటినుండియు నేను చెప్పినవిషయములను మనమున నిడుకొని యీమతిమాలిన దేవపూజలు మొదలగువానిని మాన్పించి కాంతాకనకములను సమకూర్చుకొనుటయం దప్రమత్తులై మెలంగుచు దేవేంద్రవైభోగము ననుభవింపవలయును. ఇంతేగాక "రాజానుమతే ధర్మః" అను మీపరిపాలనలోని ప్రజ లందరు నిదేవిధముగ నాచరింపవలయు నని శాసనము గావింపుడు. శాసనము నతిక్రమించిన వారిని శిక్షింతు నని ప్రకటించినయెడల కొలది కాలములోనే మన యీనూతనధర్మము లన్నియు రాజ్య మంతయు వ్యాపించును. ఇదే నాప్రార్థనము అని చెప్పిన మంత్రిమాటలను విని రాజు సమ్మతించినవాడై రాజ్య మంతయు జాటబంపెను. కుమారుడైన ధర్మశేఖరుడు తండ్రి మార్గము తప్పి సంచరించు చున్నందులకు మనస్సులో కటకటబడుచున్నను చేయునదిలేక యూరకుండెను. కొంతకాలమునకు గుణశేఖరుడు కాలగతిం జెందెను.

కుమారుడైన ధర్మశేఖరుడు సింహాసనాసీను డయ్యెను. పట్టాభిషిక్తుడైన కొలదిదినములకే తండ్రి స్థాపించిన నాస్తికధర్మములను సమూలముగా బెల్లగించి పూర్వాచారప్రకారము ధర్మయుక్తముగ బరిపాలనము గావించుచు రాజ్యము నిట్టిదురవస్థకు గొనివచ్చిన మంత్రిని పదభ్రష్టుని గావించి రాజ్యమునుండి వెడలగొట్టి యాప్రదేశమున నొకబ్రా

త్తవానిని మంత్రిగా నియమించెను. తదనంతర మాధర్మశేఖరుడు ముగ్గురు రాజపుత్రికలను పరిణయ మాడెను.

ఒకనాడు ధర్మశేఖరుడు ముప్పురుభార్యలతో విహారోద్యానవనమున విహరించుచు నం దున్నయొకసరోవరమున జలక్రీడ లాడి యొడ్డునకు జేరెను. ధర్మశేఖరుడు వచ్చునప్పుడు సరోవరమునందు తామర పూవు నొకదానిని కోసి తనపెద్దభార్యచేతి కిచ్చెను. ఆమె యాపుష్పమును చేతబట్టుకొని వచ్చుచుండ త్రోవలో నాకమల మామెచేతుల నుండి జారి పాదములపై బడెను. కమలము పడుటవలన నామెపాదముపై పెద్ద గాయ మయ్యెను. రాజు వ్రణచికిత్సకుల బిలిపించి చికిత్స జేయించెను. మరునాడు రెండవభార్యతో మిద్దెమీద పండువెన్నెలలో పరుండి సరససల్లాపము లాడుచుండ నావెన్నెల సోకినంతమాత్రమున నతిసుకుమారియైన రెండవభార్యశరీరమునకు జ్వరము వచ్చి చాల బాధపడెను. మూడవనాడు మూడవభార్యయంతఃపురమున కేగి యామెతో కేళీవిలాసమున నుండ నచ్చటికి చాలదూరమం దున్నయొకయింటిలో వడ్లు దంచుచుండుటచే రోకలిచప్పుడు వినవచ్చెను. ఆధ్వని వినబడుటచే మూడవభార్యకు శిరోవేదనము కలిగి వారముదినములు బాధపడెను. రాజా! వింటివిగదా! ఆముగ్గురిలో నధికసుకుమారు లెవరు? నిర్ణయింపు మన విక్రముడు యోజించి మూడవభార్యయే యందరికన్న సుకుమారియని వచింప భేతాళు డెగిరి తరుశాఖ కంటుకొన విక్రము డాతని కట్టి తెచ్చుచుండెను.

## పదునొకటవకథ.

భేతాళు డిట్లు చెప్ప నారంభించెను. పుణ్యపుర మనుపట్టణమును వల్లభు డనురాజు పాలించుచుండెను. ఆరాజునకు సత్యప్రకాశు డనుమంత్రిసత్తము డుండెను. ఆమంత్రిభార్య పేరు లక్ష్మీదేవి. అవల్లభు డొకనాడు

మంత్రిని జూచి అమాత్యా! నాకు కొంతకాలము భోగము లనుభవింప వలయునని వాంఛ కలిగినది. కావున రాజకార్యములను జాగ్రత్తతో జూచుచుండుము. అని చెప్పి యాప్రభువు తన యంతఃపురమున కేగి భార్యతో నిష్టోపభోగముల ననుభవించుచుండెను.

కొంతకాల మీరీతిగ జరిగినపిదప మంత్రికి విసుగుదల జనించుట చే తనయింటి కేగి శయ్యాగృహమున బరుండి యాలోచించుచుండెను. ఇంతలో భార్య వచ్చి భర్తను సమీపించి నాథా! ఏమో యాలోచించు చున్నారు. నేను తెలిసికొనవచ్చునా యన నాత డోయర్థాంగీ! రాజు రాజకార్యవిముఖుడై యుండుటవలన నాకు చాలకష్టముగా నున్నది.

ప్రభువు లేకుండ నే నొక్కడ నీకార్యము నెంతకాల మని భరింప గలనా యని చింతించుచుంటిని. అన నాలేమ నాథా! మీరు కొంతకాల ము రాజాజ్ఞను పొంది తీర్థయాత్రలకు పోయి రండు. మీ మనస్సునకు విశ్రాంతి గలుగు నని చెప్పగా మంత్రి భార్య చెప్పిన యుపాయము బాగు న్నదని తలంచి వెంటనే రాజసన్నిధి కేగి ప్రభునకు తనకోర్కె నెఱింగింప వల్లభుడు వల్లె యని యంగీకరించెను.

మంత్రి యొక దివ్యముహూర్తమున తీర్థయాత్రకై బయలుదేరి యనేకపుణ్యస్థలముల కేగి దేవతాదర్శనము జేసికొనుచు పుణ్యనదీస్నానం బుల జేయుచు క్రమముగ రామేశ్వరక్షేత్రమున కేగి సేతువులో మునింగి రామలింగేశ్వరున కభిషేకము గావించి వెలుపలకు వచ్చి సముద్రమును జూచుచు గూర్చుండెను. కొలదిగడియల కాసముద్రమునుండి బంగారు చాయగలిగిన వృక్షము పైకి వచ్చెను. ఆవృక్షమునకు పచ్చలతోగూడిన యాకులు, పుష్యరాగములతో గూడిన పుష్పములు, ప్రవాళములతో గూడిన ఫలములు గలిగియుండెను. ఆవృక్షశాఖామధ్యమున నొకదివ్య సుందరి వీణాపాణియై గానము చేయుచుండెను. ఆవృక్షము కొంతసే

పట్టునుండి సముద్రములో మునిగిపోయెను. మంత్రి యీవిచిత్రమును గాంచి వెఱగుపడి కొన్ని దినములవరకు తీర్థయాత్రను సాగించి నిజరాజధానియైన పుణ్యనగరమున కేగి ప్రభుదర్శనము జేసికొనెను. రాజు మంత్రిం జూచి తీర్థయాత్రలో నీవు చూచిన విశేషము లేమైన కలవా యని యడుగ మంత్రి తాను రామేశ్వరమున జూచిన బంగారువృక్షముసంగతిని వివరించి యిట్టివిచిత్రమును తా నెన్నడును చూడలే దనియు చెప్పిన నెవ్వరు విశ్వసింపరని చెప్ప రాజాశ్చర్యమగ్ను డై రాజ్యమును మంత్రి కప్పగించి తాను వెంటనే బయలుదేరి రామేశ్వరక్షేత్రమున కేగి స్వామిదర్శనమును జేసి సముద్రతీరమున గూర్చుండెను. నియమితకాలమున కావృక్షము సముద్రము నుండి బయల్వెడలెను. వల్లభుడు తటాలున సముద్రమున నురికి యీదుకొనుచు బోయి యావృక్షము నెక్కి యాసుందరిప్రక్క గూర్చుండెను. రాజచ్చట కూర్చుండినతక్షణమే యావృక్షము మునింగి పాతాళము జేరెను. పాతాళలోకమున కేగినవెంటనే యాసుందరి రాజుం జూచి నీ వెవ్వరవు? ఈవృక్షము నెక్కి యిటకు వచ్చిన కారణమేమి యని యడుగ నత డిట్లనియె. నేను పుణ్యనగరాధీశుడను. నాపేరు వల్లభుడు. నేను నీరూపముం గాంచి మోహపరవశుడ నై యిటకు జేరితిని. అని చెప్ప నాకోమలాంగి రాజేంద్రా! నన్ను వివాహము జేసికొనుట కొకనియమము కలదు. ఏమనగా? కృష్ణచతుర్దశినాడు నీవు నన్ను సమీపింపరాదు. అట్లయినచో నంగీకరింతు నన నామెవాక్యమునకు వల్లభుడంగీకరించి యామెనుపరిణయ మాడెను. కొలదిదినములకే కృష్ణచతుర్దశి వచ్చెను. వల్లభుడు తన వాగ్దానము ననుసరించి నాటిరాత్రి యామెను వదలి దూరమున కేగి మారువేషమున ఖడ్గధారియై గదిసమీపమున పొంచియుండి యేమి జరుగునో చూడ నిరీక్షించియుండెను. అర్ధరాత్రి వేళ నొకరాక్షసు డాగదిలోని కేగి యాసుందరిని కౌగలించుకొనెను. రాజు తలుపుసందునుండి చూచి క్రోధపరవశు డై వరనుండి ఖడ్గమును

బెరికి తలుపులను ద్రోసికొని యారాక్షసునిపైకి లంఘించి దానవాధమా! నాయెదుట నాభార్యను జెఱబట్టెదవా రమ్ము. నిన్ను హతమార్చెదనని పలుకుచు నారాక్షసునితో ద్వంద్వయుద్ధమొనర్చి వానిని హతమార్చెను. వెంటనే యాసుందరి రాజేంద్రా! నీవంటి వీరశిఖామణిని నే నెచ్చటను జూచి యుండలేను. పర్వతము లన్నిటిలో రత్నము లుండవు. పట్టణము లన్నింటిలో వీరు లుండరు. ప్రతివనములోను చందనతరువు లుండవు ప్రతి ఏనుగశిరమునను ముత్యము లుండవు. అట్లనే రాజైనంతమాత్రమున వీరు డనరాదు. క్షత్రియులలో వీరుడన నీవే. యని పల్కుచున్న నామెం గాంచి రా జిట్లనియె. ఈరాక్షసు డెవ్వరు? ఎందుకు వచ్చెను? అని యడుగ నామె యిట్లనియె. నేను విద్యాధరుని పుత్రికను. నాపేరు సుందరి. నాతండ్రి ప్రతిదినము నన్ను తనప్రక్క నుంచుకొని భుజించుచుండును. నేను లేనినా డతడు భుజింపడు. ఒకనాడు నాతండ్రి భోజనసమయమున నే నింటిలో లేకపోవుటచే నాతండ్రి కోపగించి ప్రతికృష్ణచతుర్దశి దినమున నీవు రాక్షసునిచేతికి జిక్కుదువుగాక యని శపించెను. తదనంతరము నే నావృత్తాంతమును విని నాతండ్రిపాదములపై బడి దుఃఖింపగా నతడు జాలిపడి కొన్నిదినములకు వీరు డొకడు వచ్చి రాక్షసుని సంహరించి నీకు శాపవిముక్తిని గలిగించునని చెప్పెను నేటికి నివలన నాచెఱ వదలినదని వచించి రాజేంద్రా! నే నింక నాతండ్రికి నమస్కరింప బోయెద ననవల్లభు డోసుందరీ! ఒక్కమారు నారాజ్యమునకు రావలయునని కోరుచున్నా నని పల్క నామె యంగీకరించెను. రాజామెను వెంట నిడుకొని తననగరమున కేగెను. ప్రభువు వచ్చుటచే నగరమంతయు నలంకరింపబడెను. జను లందరు మహావైభవముగ పండుగ జేసికొనిరి. వల్లభు డొకశుభలగ్నమున విద్యాధరకన్యను పాణిగ్రహణము జేసికొనెను. ఒకనా డామె తండ్రికడ కేగెదనని వచింప రాజు చింతాక్రాంతు డయ్యెను. అతని వైఖరిని గని సుందరి యిట్లనియె. రాజేంద్రా! నే నప్పుడు నాతండ్రిం డను పోజాల

ను. కారణ మేమనగా నిన్ను పరిణయ మాడుటవలన నాగంధర్వలోక నివాసము పోయినది. నే నిప్పుడు వెళ్ళినను నాతండ్రి రానీయడని చెప్ప వల్లభు డానందభరితుడై యిర్వురు భార్యలతో మహానందమున దుల తూగుచుండెను. ఈగంధర్వకన్యాపరిణయమును విని మంత్రి తటాలున క్రిందబడి ప్రాణముల వదలెను. విక్రమార్క మహారాజా! మంత్రి చని పోవుటకు కారణ మేమన? విక్రము డిట్లనియె. ఇదివర కున్నభార్యాసౌం దర్యమునకు ముగ్ధుడై రాజకార్యములను వదలిన యీరాజు గంధర్వ కన్యాసాంగత్యమున రాష్ట్రమును, ప్రజలను చూడడు. అందువలన తన కపకీర్తి, రాజ్యమున కరాజకత్వము, ప్రజలకు కష్టములు కలుగును గదా యనుచింతతో ప్రాణములను వదలెనని చెప్పగా భేతాళు డెగిరి చెట్టు కొమ్మను వ్రేలాడుచుండెను.

## పదు రెండవ కథ.

విక్రమార్కుడు తిరిగి భేతాళుని పట్టి తెచ్చుచుండ భేతాళు డిట్లు చెప్ప నారంభించెను. చూడామణి యనునగరమున శిరోమణి యను రాజు రాజ్యము చేయుచుండెను. అతనికి దేవస్వామి యనుపేరుగల బ్రా హ్మణుడు గురువై యుండెను. ఆదేవస్వామి హరిస్వామికి యనుకుమా రుడు కలడు. ఆహరిస్వామి చక్కదనమునకు మన్మధుడు. ధనమునకు గుబేరుడు. లావణ్యవతి యనుపేరుగల విప్రకన్యక నాతడు పరిణయమై తనయింటికి గొనివచ్చెను. ఇరువురు పరస్పరప్రేమపాశబద్ధులై మెలంగు చుండిరి.

వసంతకాలమున నొకరాత్రి హరిస్వామి భార్యతో గలసి మిద్దె పై బరుండెను. చల్లనివెన్నెలలో వా రిర్వురు సరససల్లాపములతో ప్రొద్దు గడపి నిద్రించిరి. గాఢనిద్రలో నుండుతరి లావణ్యవతి ముఖమునగల ము సుగు తొలగిపోయెను. ఒకగంధర్వుడు విమానారూఢుడై యంతరిక్ష

మున బోవుచు క్రిందకు జూచి లావణ్యావతియొక్క ముఖసౌందర్యమునకు మెచ్చుకొని క్రిందకు దిగి నిద్రలో నున్నయామెను తనవిమానముపై నెక్కించుకొని వెడలిపోయెను. తెల్లవారు జామున హరిస్వామి లేచి ప్రక్కను భార్య లేకపోవుటచే క్రిందకు దిగి యిల్లంతయు వెదకెను. కాన రాలేదు- ప్రక్కయిండ్లు- వీధులు వెదకెను కాన రాలేదు. ఊరంతయు గాలించెను. నూతులు, చెరువులు విమర్శించెను. కాని భార్య యెచ్చ టను గానరాకపోవుటచే కన్నీరు గార్చుచు నింటికి వచ్చి హా ప్రేయసీ! యనుచు గూలబడెను. దుఃఖాక్రాంతుడై భార్యపై వ్యామోహమున మతి చెడి గృహమును వదలి తీర్థయాత్రల జేయుచు దిరుగుచుండెను. ఒకనాడొకయూరి కేగి భిక్షాటనము జేయుచు నొకవిప్రగృహమున కేగి భిక్ష నడిగెను. ఆగృహయజమానురాలొకగిన్నెలో క్షీరాన్నమును బోసి యిచ్చెను. హరిస్వామి యాక్షీరాన్నపుగిన్నెను గొని ప్రక్కనున్న చెరువుగట్టున కేగి యట నున్నమఱ్ఱిచెట్టుమొదట నాగిన్నె నుంచి స్నాన మాడి దానిని త్రాగవలయునని తలంచి చెరువులో స్నానము జేయుచుం డెను. ఇంతలో నొకసర్పము చెట్టుపైనుండి వచ్చి యాపాయసపుగిన్నెను సమీపించి యందు విషము గక్కి పోయెను. హరిస్వామి స్నానము జేసి వచ్చి యందు సర్పవిష మున్నదనువిషయము నెఱుంగక యాతురమున గ్రోలెను. వెంటనే యాపాయసము గర్భము జేరుటయే తడవుగ నాలుక వెనుకకు లాగుచుండెను. ఆతనికి దాహము మిక్కుట మయ్యెను. హరిస్వామి వెనుక కేగి యాపాయసము నిచ్చిన గృహయజమానురాలిని జూచి నీవు విష మిచ్చినసంగతి నెరుంగక పాయస మనుకొని త్రాగితిని. నేను చనిపోవుచుంటి నని చెప్పి పడిపోయి మరణించెను. గృహమేధి భార్యం జూచి ఓసీ! పాపాత్మురాలా! నీవలన నాకు బ్రహ్మహత్య లభించినది ఛీ! నీముఖము చూడరాదు. పొమ్మని యింటినుండి వెడలగొట్టె ను. రాజా! వింటివా! ఆపాప మీనల్వురిలో నెవనికి జెందును. అని

యడుగ విక్రమార్కుడు బ్రాహ్మణుడు బిచ్చము నడుగుటయు- గృహిణి యగుస్త్రీ యతిథులకు భిక్షము నిడుటయు ధర్మమే. త్రాచు విషమును గ్రక్కుటయును ధర్మమే. కాని యదార్థమును దెలిసికొనకుండ భార్యను వెళ్లగొట్టిన పాపికి పాపము కలదు. అని చెప్ప భేతాళు డెప్పటియట్లు చెట్టుకొమ్మను వ్రేలాడుచుండ విక్రముడు పట్టి తెచ్చెను.

# పదమూడవకథ.

భేతాళు డిట్లని చెప్ప దొడంగెను. చంద్రకాంత మనుపట్టణము కలదు. రణధీరు డనురా జందు బాలించుచుండెను. ఆనగరములో ధర్మధ్వజు డనుగొప్పవర్తకుడు గలడు. అతనికి శోభనాంగి యను చక్కని కుమార్తె కలదు. ఆకన్యకకు సంవత్సరములు వచ్చుచున్నకొలది వయస్సుతోగూడ యౌవనశోభ యంతయు ప్రత్యవయవము నాశ్రయించి సార్థక నామ యనుప్రఖ్యాతి నొందుచుండెను.

ఇట్లుండ నాయూరిలో కొందరు దొంగలు రాత్రులయందు గన్నములను వైచి ధనమును దొంగిలించుకొని పోవుచుండిరి. ధనికులైన వర్తకు లందరు నాదొంగలబాధకు దాళలేక ప్రభువుదగ్గర కేగి తమకు సంభవించుచున్న కష్టములనుగూర్చి మొఱపెట్టుకొనిరి. రాజు వారిం జూచి మీ రేమియు జింతింపకుడు నేనందులకు దగిన కట్టుదిట్టము చేయుచున్నాను. అని చెప్పి కొత్వాలును బిలిపించి రాత్రులయందు ప్రతి వీధికిని రక్షకభటులను గస్తీ తిరుగున ట్లేర్పాటు చేసి దొంగయని తోచిన వానిని సంహరింపు మని యాజ్ఞ నొసంగి పంపివైచెను. ఇంత కట్టుదిట్టము జేసినను దొంగతనములు జరుగుచునే యుండెను. దొంగలలో నొకడైన ను చిక్కలేదు. మరల పౌరు లందరు రాజుతో మొఱబెట్టుకొనిరి. రాజు వారి నూరడించి యారాత్రి తాను స్వయముగ మారువేషమును ధరించి నడుమున డాలు, కరవాలమును భద్రము జేసి పురములోనికి బయలు

దేరెను. కొంతదూరము నడువగ నొకదొంగ రాజున కెదురు వచ్చుచుండెను. రాజు వానిని సమీపించి నీ వెవరవు? అని యడుగ నేను దొంగను. నీ వెవర వని యడుగ రాజు నేనును దొంగనే యని ప్రత్యుత్తర మిచ్చెను. చోరుడు ప్రసన్నుడై అట్లయిన నిద్దరము కలసి దొంగతనము చేయుదము రమ్మని యాహ్వానించెను.

వా రిద్దరును కలసి యానగరములో కొన్నిధనికులగృహములను దోచుకొని యాధనమును తీసికొని యూరిబయటకు పోయిరి. రాజును వానిని వెన్నంటి వానిచర్య యంతయు గనిపెట్టుచుండెను. చోరు డాధనము నొకపెద్దనూతిలో బడవైచి యందురికెను. రాజును వానివెంట నానూతిలో నురికెను. ఇద్దరు నా నూతిలోపలిమార్గమున పాతాళపురమును జేరిరి. చోరుడు రాజు నొకమందిరద్వారమున నిలువబెట్టి తాను లోపలి కేగెను. ఇంతలో లోపలినుండి యొకదాసి వచ్చి రాజుం గాంచి మహారాజా! ఈదుర్మార్గుని నమ్మి మీ రొంటిగ నేలవచ్చితిరి? ఈదుష్టుడు మిమ్ము గుర్తించినాడు. మీ రిప్పుడు పారిపోకున్న మీప్రాణములు నిలువవు. అని చెప్ప రాజాదాసిం గాంచి నేను నాయూరికి బోవుమార్గమును జూపుమని యడుగ నాదాసి ప్రభువును సమీపమార్గమున చంద్రకాంతపురమును జేర్చెను. రణధీరుం డాదాసిని తనదగ్గర నుంచుకొని మరునాడు సైన్యసమేతుడై దాసిసహాయమున పాతాళపురి జేరి యాచోరునిగృహమును ముట్టడించెను. ఆచోరుడు పరువెత్తి తన ప్రభువైన యొకరాక్షసునితో నీవృత్తాంతమును వచించి తనకు తోడ్పడుమని యడిగెను. ఆరాక్షసుడు ప్రతిదినము చోరునివలన సాయమును పొందుచున్నవా డగుటచే వెంటనే పరివారసహితుడై వచ్చి రాజు నెదుర్కొనెను. రాజు వారితో ఘోరయుద్ధము జేసి యారాక్షసుని సంహరించి యాచోరుని పట్టి బంధించి వాడు కొల్లగొని దాచిన ధనరాసులను కనుగొని వానిని పట్టించుకొని

తనరాజ్యమును జేరెను. మరునా డాచోరుని స్నానము జేయించి మంచి బట్టలను గట్టించి సేనాపతిని బిలిపించి యిట్లనియె. వీని నూ రంతయు ద్రిప్పి శూలముపై నెక్కింపు మని చెప్పి పంపెను. సేనాపతి రాజాజ్ఞచొప్పున నాచోరుని యేనుగపై నెక్కించి చంద్రకాంతనగరమును కొల్లబెట్టిన చోరుడు వీడే. రాజుగారు వీనికి శూలారోపణశిక్ష విధించిరి. అని చాటుచు నగర మంతయు ద్రిప్పుచుండెను. ధర్మధ్వజుని కుమార్తెయైన శోభనాంగి మేడపైనుండి నవయవ్వనములో నున్న యాచోరుని జూచి మోహించి తండ్రిని జూచి తండ్రీ! నే నాచోరుని వరించితిని. అతడే నాభర్త. నీవు రాజుగారిని జూచి యతనికి శూలారోపణశిక్షను తీసివేయింపు మన నతడు కుమారీ! నీ వెంత వెఱ్ఱిదానవు? నగరమును కొల్లబెట్టిన యాచోరుని రాజు విడచునా యన నామె జనకా! అట్లయిన నాప్రాణము నాతని తోడిదేయని పలుక విధిలేక ధర్మధ్వజుడు రాజుసమీపమున కేగి నమస్కరించి మహారాజా! తమకు లక్షలకొలది ద్రవ్యము కావలయునన్న నొసంగెదను. ఆచోరునకు ప్రాణదాన మొసంగి విడువవలయును. అని ప్రార్థించెనుగాని రా జెంతమాత్రమును చెవిని బెట్టక నానగరము నంతయు కొల్లబెట్టిన యాదుష్టు నెంతమాత్రము మన్నింప నని ఖండించి చెప్పెను. ధర్మధ్వజు డావృత్తాంతమును తనకుమార్తె కెఱింగించెను. సేనాపతి రాజాజ్ఞచొప్పున చోరుని నగర మంతయు ద్రిప్పి శూలముకడకుం గొంపోయి నిలువబెట్టెను. శోభనాంగి తండ్రితో నాప్రదేశమున కరుగుదెంచి శూలముపై నెక్కించిన చోరుని గాంచి మొదట పక్కున నవ్వెను. తదుపరి వెక్కివెక్కి యేడ్చెను. చోరుడు శూలము నెక్కించిన కొంతకాలమునకు అనగా కొలదిఘడియలకు మరణించెను. మరణించిన వెంటనే శోభనాంగి యాశవమును గొనిపోయి ప్రాంతమం దున్న దేవీమందిరము నెదుట చితి పేర్పించి యందు శవము నుంచి దేవిని ప్రార్థించి తానుగూడ నందెక్కి యగ్ని నంటించుమని చెప్పి సహగమనమునకు సిద్ధపడెను.

ఈమె మనోనిశ్చలమునకు మెచ్చి దేవి కుమారీ! నీపట్టుదలకు సంతసించితిని. వరము నడుగు మన నామె తల్లీ! నామనోవల్లభుని బ్రదికింపు మన నాదేవి చోరునికళేబరముపై యమృతవర్షమును గురిపించి వానిని బ్రదికించెను. శోభనాంగి సంతోషముతో భర్తను వెంటగొని యింటి కేగెను. రాజా వింటివిగదా శోభనాంగి మొదట నవ్వుటకును, తదుపరి యేడ్చుటకును కారణ మేమని యడుగ రా జిట్లనియె. ఆమె నవ్వుటకు కారణ మేమనగా ప్రేమయొక్క పరిణామస్థితి బహువిచిత్రమైనది. తా నొక ధనాఢ్యుడైన వర్తకుని కుమారికయై యుండియు నొకచోరునిపై ప్రేమ నిల్పవలసి వచ్చినది. మోహ మెంత గ్రుడ్డిదని నవ్వినది. తదుపరి తాను వరించిన భర్త జీవించకపోయెను. జీవితములో భర్తృసుఖమునకు నోచుకొననైతినని దుఃఖించెను. ఇదియే కారణ మని చెప్ప భేతాళుడు మరల చెట్టుపై కెగిరెను. విక్రముడు మరల నతని బట్టి తెచ్చుచుండెను.

## పదునాలుగవకథ.

భేతాళు డిట్లని చెప్ప దొడంగెను. కుసుమావతి యనుపట్టణము గలదు. సువిచారుడను రాజు ధర్మయుక్తముగా నాపురమును బాలించుచుండెను. ఆరాజునకు చంద్రప్రభ యనుపేరుగల కుమార్తె కలదు. ఆమెకు పదునారువత్సరములప్రాయము వచ్చునప్పటికి జగన్మోహినియై నవయవ్వనప్రాదుర్భావము గలిగి వివాహాయుక్తయై యొప్పుచుండెను. ఒకనాడాచంద్రప్రభ చెలికత్తెలతో వనవిహారమున కేగెను. అంతకు ముందే యావనమునకు హరిశర్మ యనువిప్రుడు నవయవ్వనుడు ఇరువది వత్సరములు వయస్సుగల సుందరాకారు డొకడు వచ్చి యొక చెట్టుక్రింద విశ్రమించియుండెను. రాజపుత్రిక విహరించుచు ముందునకు వచ్చి యావిప్రుని జూచెను. హరిశర్మయు చంద్రప్రభను జూచెను.

ఇరువ్వురి చూపులు లగ్నములై నవి. చంద్రప్రభయొక్క సౌందర్యమును జూచి హరిశర్మ మూర్ఛిల్లెను. రాజకుమారియు మారసమానసుందరు డగుహరిశర్మను జూచి మన్మథబాణములకు గురియై నిట్టూర్పు విడుచుచు విడిచి పోలేక యత్యంతకష్టమున చెలికత్తెలం జేరి తనసౌధమున కేగెను.

ఇంతలో చంద్రస్వామి- మూలస్వామి యనుపేర్లుగల యిరువ్వురు విప్రులు పాతికసంవత్సరములవయస్సు కలవారు విదేశములలో విద్యాభ్యాసము జేసి యాయూరికి వచ్చుచు నాతోటలోనికి వచ్చి కించిత్కాలము విశ్రమించినపిదప నట మూర్ఛపడియున్న హరిశర్మను జూచి శీతలోపచారముల నేద దీర్చి కూర్చుండబెట్టి నీవృత్తాంత మేమి? నీ విట్లు పడియుండుటకు గారణ మేమి? అని యడిగిరి. హరిశర్మ యావిప్రులం జూచి అయ్యలారా! నాదుఃఖమునుగూర్చి మీ రేల యడిగెదరు? కష్టమును దీర్పగలవారితో జెప్పుకొనిన లాభము కలుగును. లేకున్న వృథా వాగ్వ్యయముకన్న నేమియు ఫలితము లేదు. అని చెప్ప మూలస్వామి యిట్లనియె. నీకష్ట మేమో మా కెఱింగింపుము. చేత నైనంతవరకు దోడ్పడెదము. అనవుడు హరిశర్మ రాజకుమారియొక్క వృత్తాంతము నెఱింగించి యామెయొక్క సందర్శనమే నా కీ దురవస్థను గలిగించినదని నుడివెను. మరియు నామెను సౌంమభాగ్యము గల్గిన జీవించెదను. లేకున్న నాప్రాణములు నిలువవు. అని పలుక మూలస్వామి నీవు మాతో మే ముండుప్రదేశమునకు రమ్ము. అందులకు దగినసదుపాయము నాలోచించెదము. లేకున్న వలయునంతధనము నొసంగెద మన హరిశర్మ యిట్లనియె. ప్రపంచకమున నెంతధన మున్నను, రత్నము లున్నను, స్త్రీరత్నముతో సాటి గావు. సౌందర్యవతియైన స్త్రీరత్నము లేకున్న ధనముతో నేమిలాభము? ఎంతధన మార్జించినను నారీసుఖమున కేగదా. అందుకే ధర్మముయొక్క ఫలితము ధనము- ధనమువలన ఫలితము సుఖము-

సుఖముయొక్క స్థానము సుందరియైన భార్య. అది లేనియెడల సర్వము శూన్యమే. కావున నా కారాజపుత్రికసాంగత్యము కావలయును. అని పలుక మూలస్వామి యిట్లనియె. మావెంట రమ్ము. నీ కందుల కొక యుపాయమును జూపెదను. రమ్మని లేవదీసి యాతని వెంటగొని తమ విడిదికి జేరిరి. మరునాడు మూలస్వామి తనమంత్రబలమువలన రెండుఘుటికలను తయారుచేసి హరిశర్మచేతి కొకఘుటిక నిచ్చి యిట్లనియె. దీనిని నీవు నోట నుంచుకొంటివేని పదునారేండ్లసుందరి వయ్యెదవు. తీసినచో మరల నీయెప్పటిరూపము వచ్చును. అని చెప్పి యాఘుటికను హరిశర్మ నోటిలో నుంచినతోడనే నత డొకషోడశవర్షప్రాయము గలకన్నియగా మారెను. రెండవఘుటికను తననోట పెట్టుకొనినతోడనే మూలస్వామి డబ్బదియేండ్ల ముదుసలిగా మారెను. మూలస్వామి ముదుసలియై యా కృత్రిమకన్యను వెంట నిడుకొని రాజైన సువిచారునికడ కేగెను. సువిచారు డావృద్ధబ్రాహ్మణుని గౌరవించి కూర్చుండబెట్టి నమస్కరించి వచ్చినకార్య మే మని యడిగెను.

ఆవృద్ధబ్రాహ్మణుడును ప్రభువునకు వేదోక్తాశీర్వచన మొనర్చి యిట్లనియె. మహారాజా! నేను గంగాతీరనివాసిని. నాకుమారునికి తగిన కన్యను వెదకి తీసికొనివచ్చుటకై పరదేశముల కేగి వెదకి యీకన్యను కోడలుగా జేసికొనదలంచి గొనివచ్చితిని. ఇంటి కేగి విచారింప నాగ్రామవాసులకు, నాభార్యాపుత్రులకు దుర్భరమైన కలహము వచ్చుటచే నా భార్యాపుత్రు లాగ్రామము వదలి యెచ్చటికో వెడలిపోయిరని తెలిసినది. నే నిప్పుడు వారిని వెదకించుకొని రాదలంచితిని. గాని యీసుకుమారి మార్గమధ్యమున కష్టములు పడజాలదు. కావున నేను తిరిగి వచ్చువరకు యీకన్యకను మీయంతఃపురమున నుంచవలయును. అని చెప్ప రా జిట్లు తలపోసెను. యవ్వనవతియై, సుందరియైన కన్యకను గాపాడుట కడు దుర్లభము. వీలు కా దనినచో నీవృద్ధబ్రాహ్మణుడు కుపితుడై

శపించునేమో? ఏమి చేయవలయునా యని యాలోచించి కృతనిశ్చయుడై యిట్లనియె. బ్రాహ్మణోత్తమా! అట్లే మీయిష్టప్రకార మామెను మానగరులో నుంచి శీఘ్రకాలములో దోడ్కొనిపోండు అని వచించి కుమార్తెయైన చంద్రప్రభను పిలిచి యీవిప్రకన్యను నీయంతఃపురములో నుంచి భద్రముగ గాపాడు మని పంపెను. మూలస్వామి వెడలి పోయెను.

రాజపుత్రిక యాకపటవిప్రకన్యను చేయి పట్టుకొని యంతిపురము లోనికి గొంపోయి మజ్జన భోజన శయనాదులయందు సైతము తనకడనే యుంచుకొనెను. ఇట్లు దినములు జరుగ నొకనాటిరాత్రి వా రిర్వు రేక శయ్యాగతులై పరుండియున్నప్పు డక్కపటబాలిక రాకుమారిం జూచి యిట్లనియె. చెలీ! నీకడుపున నేదోవిచార మున్నట్లు నీముఖమున బొడగట్టుచున్నది. కారణ మేమో నా కెఱింగింతువా యన చంద్రప్రభ యిట్లనియె. చెలీ! యేమని చెల్పుదును. కొలదిదినములక్రింద నొకనాడు వసంత కాలమున సాయంసమయమున వనవిహారమున కేగి యావనములో విశ్రమించియున్న కాముని బోలిన విప్రకుమారుని గంటిని. అదిమొదలు విరహతాపముచే కృశించుచుంటిని. అతనిసౌందర్యమును గాంచి మూర్ఛిల్లితిని. నాచెలికత్తెలు నన్ను సవారిలో నునిచికొని యింటికి జేర్చిరి. ఆసుందరుని వియోగమే నా మనస్తాపమునకు గారణము. అని చెప్ప నాకపట బాలిక యిట్లనియె. చెలీ! నీ కాసుందరుని పొందు సమకూర్చెదను. నా కేమి బహుమతి నొసంగెదవని యడుగ నామె నాజీవిత మంతయు నీకు దాసి నయ్యెదను. అని పలుకగా హరిశర్మ యారాకుమారి కన్నులను మూసి తన నోటిలోని ఘుటిక తీసి చేతబట్టుకొని నిజరూపమును ధరించి రాజకుమారియెదుట నిలిచెను. చంద్రప్రభ గుర్తించి హరిశర్మ నాలింగన మొనర్చుకొని శయ్యపైకి జేర్చెను. నాటిరాత్రి వా రిర్వురు మహానంద

సాగరమున నోలలాడిరి. తెల్లవారుఝామున ఘుటిక నోట ధరించి యెప్పటియట్లు స్త్రీ యయ్యెను. ఈవిధముగ హరిశర్మ రాత్రులు పురుషుడై రాజపుత్రికను సంతోషపెట్టుచు పగలు వనితారూపమున నుండి దినములు జరుపుచుండెను. ఈవిధముగ కొలదిమాసములు జరుగగనే యారాజకుమారి గర్భమును ధరించెను.

ఒకనాడు మంత్రికుమారుని వివాహము జరిగెను. ఆవివాహము నకు రాజాంతఃపురమునందలి స్త్రీ లందరును వెడలిరి. మంత్రికుమారుడు స్త్రీవేషధారియైన హరిశర్మను జూచి మోహించెను. వివాహానంతరము రాజకన్యక చెలికత్తెలతోసహా తన యంతఃపురము జేరెను. మంత్రికుమారు డాకపటవిప్రబాలికపై మోహముచే యన్నపానాదులను వదలి చింతింపుచుండ నతనిమిత్రులు కొందరు ప్రక్కజేరి కారణము నడుగ నాతడు తనమనోరథమును వారి కెఱింగించెను. మిత్రు లావృత్తాంతమును గొనిపోయి మంత్రి కెఱింగించిరి. మంత్రి యొకనాడు రాజసన్నిధి కేగి మహారాజా! మీ యంతఃపురమున గలవిప్రకన్యకను మోహించి నాకుమారుడు పరితాపమున మునింగి యన్నపానాదులను సైతము వదలినాడు. కావున తాము కరుణించి యాకన్యకను నాకుమారున కిప్పింపు డని యడుగ రాజిట్లనియె. విప్రకన్యకను నీసుతు డెట్లు వివాహ మాడును? ఇట్టి యధర్మకార్యమును నేను చేయజాలను. అని చెప్ప మంత్రి నిరాశతో వెడలిపోయెను. మంత్రికుమారుడు విరహవేదనచే మంచము బట్టెను. కుమారుని పెగల విచారమువలన మంత్రి రాజకార్యములను వదలెను. అందువలన విధిలేక నృపుడొకదినమున తన మంత్రియెదుట నుండగనే యావిప్రకన్యకను బిలిపించి యిట్లనియె. విప్రకుమారీ! నీ విటకు వచ్చి చాలదినము లయ్యెను. నిన్ను దిగబెట్టి వెళ్ళిన యావిప్రు డింతవరకు జీవించెనో లేదో తెలియదు. కావున నీవు మామంత్రికుమారుని పరిణ

య మాడుము. అతడు నీపై విరాళిచే మంచము పట్టియున్నాడు. సుందరుడైన యాతని జెట్టపట్టుము. అని పలుక నాకపటబాలిక యిట్లనియె. నేను విప్రకన్యను. క్షత్రియు నెట్లు వివాహ మాడగలను. మీమంత్రి కుమారు డొక్కసంవత్సరకాలము సకలతీర్థములను మునింగి తీర్థయాత్ర గావించి వచ్చునేని నే నాతని బరిణయ మాడుదు నన మంత్రి యిట్లనియె. నీవు మాయింట నుండుట కంగీకరించినచో నాకుమారుని తీర్థయాత్రకు బంపెద నన హరిశర్మ వల్లెయని యంగీకరించెను. మంత్రి యాకృత్రిమ విప్రకన్యను వెంట నిడుకొని తనయింటి కేగెను. కుమారునితో నామె నియమమును వచింప మంత్రినందను డామెం జూచి సంతసించినవాడై మరునాడే పయనమై తీర్థయాత్ర కేగుచు దనప్రథమకళత్రమగు సౌభాగ్యసుందరిని జూచి నీ వీమెను భద్రముగా గాపాడుచుండు మని చెప్పి వెడలిపోయెను.

హరిశర్మ యదిమొదలు స్త్రీరూపముతో నంతఃపురమున నామంత్రికుమారుని పత్నియైన సౌభాగ్యసుందరితో సమముగ స్నానభోజనాదులలో బాల్గొనుచు దన మాటలచేతను పనులచేత నామె యనురాగము నార్జించెను. ఒకనాడు సౌభాగ్యసుందరి కపటవిప్రబాలికతో నేకశయ్యపై బరుండి యిట్లనియె. చెలీ! నే నేమిచేయుదును. నావివాహ మైనది మొదలు నాభర్త నీపై ప్రేమచే నన్నొకనాడైన పలుకరింపలేదు. అతిక్రమించి వచ్చుచున్న యీయవ్వనము నాచిత్తమును నిలువనీయ కున్నది. ఈమదనతాప మెట్లు పోవును. నాహృదయ మిప్పుడు సుందరపురుషాలింగనమునకై దగగొని యున్న దేమి చేయుదు నన నాకపటవిప్రకన్య సౌభాగ్యసుందరిని గౌగలించుకొని చెలీ! నేను నీబాధను నివారణ జేసెదను. నా కేమిబహుమతియన నామె యెల్లకాలము నీదాసినై పాదసేవ జేసెదనన నాబాలిక నీవు కండ్లు మూసుకొనుము. నామంత్రశక్తివలన నీ కొకసుందరపురుషుని జూపెదను. అని పల్క సౌభాగ్యసుందరి కనులు

మూసికొనెను. హరిశర్మ నోటిలోని ఘుటిక దీసి తననిజరూపమున ప్రత్యక్ష మయ్యెను. మంత్రిపుత్రునిభార్య యాసుందరవిప్రయువకుని జూచి కామోద్రేకము కలిగియుండుటచే సంతోషభరితయై తటాలున గౌగలించుకొని శయ్యకు దార్చెను. ఆవిధముగ వా రిర్వురు నారాత్రి యంతయు కేళీవినోదముల దేలిరి. తెల్లవారిజామున హరిశర్మ ఘుటికాసహాయమున స్త్రీ యయ్యెను. ఇట్లాతడు మంత్రిపుత్రునిభార్యను సురతసౌఖ్యమున దేలించుచుండెను.

ఈవిధముగ సంవత్సరకాల మొకత్రుటిలో వెళ్లించిరి. తీర్థయాత్ర కేగిన మంత్రికుమారుడు వచ్చెను. ఇంటిలోని వా రంద రతనికి మంగళాచరణములను సల్పిరి. నాటిరాత్రి హరిశర్మ స్త్రీరూపమున నేదియో పనియున్నట్లు వెలుపలకు వచ్చి నోటిలోని ఘుటికను దీసి పురుషరూపమున తనస్థానమున కేగెను. మరునాడు మూలస్వామిని జూచి జరిగిన వృత్తాంత మంతయు దెల్పి ఘుటిక నతని కొసంగెను. ఇక్కడ మంత్రిగారియింటిలో నావిప్రకుమారి మాయ మగుటచే వెదకివెదకి విసిగి యూరకుండిరి. మూలస్వామి మరల ఘుటికను నోట నుంచుకొని వృద్ధుడై చంద్రస్వామిని వెంట నుంచుకొని సువిచారుని కొలువుకూటమున కేగి రాజుచే గౌరవింపబడి యొకచో గూర్చుండెను.

వృద్ధవిప్రుడు రాజుం గాంచి రాజా! పరమేశ్వరానుగ్రహమువలన నే నేగినపని నెఱవేఱినది. నాభార్యాపుత్రులు కనపడినారు. ఇతడే నాకుమారుడు. ఇంక నాకోడలిని బంపితివేని ఇర్వురను వెంట గొనిపోయెద నన రా జిట్లనియె. బ్రాహ్మణోత్తమా! క్షమింపుము. నీకోడలు చిరకాలమైనను రాకుండుటచే నామెను మంత్రికుమారున కొసంగి పరిణయము జేయ స్థిరపరచి పంపితిని. గాని మూడుదినములనుండి యామె మాయ మయ్యెనని వాడుకగా నున్నది. అపరాధమును క్షమింపు మన నావృద్ధుడు కపట

క్రోధము నభినయింపుచు రాజా! ఎంత యనర్థకము జేసితివి? నావంశము వృద్ధి గాకుండ జేసితివి. చూడుము. నిన్ను శపించెద ననుటయు రాజు భయపడి మహానుభావా! నన్ను శపించిన మీ కేమి లాభము? జరిగిన దేమో జరిగినది. బ్రాహ్మణులు క్షత్రియకన్యను బెండ్లాడు టాచారమేకదా! నాకుమార్తెయైన చంద్రప్రభ నిచ్చెద గైకొనుడని వేడుకొన వృద్ధుడు శాంతించి రాజా! బ్రాహ్మణులకు దీర్ఘక్రోధము దగదు. అట్లనే వివాహము చేయు మన రాజు చంద్రస్వామికి తనకుమార్తె నిచ్చి వివాహము జేసి యనంతరము తనకుమార్తెను వారివెంట బంపెను. మూలస్వామి వా రిర్వురిం గొని యథాస్థానమునకు వచ్చెను. ఈవృత్తాంతమును హరిశర్మ విని యటకు వచ్చి చంద్రప్రభ తనభార్య యని కలహించెను. చంద్రస్వామి అగ్నిసాక్షిగ పెండ్లి జేసికొనిన భార్యను నీ కెట్లిత్తు నని ధిక్కరించెను. హరిశర్మ ఇంతకుముందె యీమెకు నావలన గర్భము నిలిచిన దని చెప్పెను. మూలస్వామి వారిజగడమును మాన్పజాలక పోయెను. విక్రమరాజేంద్రా! వింటివిగదా! ఆమె యెవ్వనిభార్య యగునో వచింపు మన నత డిట్లనియె. హరిశర్మవలన నిలిచినగర్భము రహస్యము, చౌర్యము. చంద్రస్వామి యథావిధిగ పెండ్లాడినవాడు గావున చంద్రప్రభ చంద్రస్వామికే భార్య యగు నని చెప్ప భేతాళు డెప్పటియట్ల వృక్షాగ్రమున కేగెను.

# పదునైదవకథ.

విక్రమార్కుడు మరల భేతాళుని పట్టి తెచ్చుచుండ నాత డిట్లు చెప్ప నారంభించెను. రాజా! వినుము. హిమాలయ మనుపర్వతప్రాంతమున గంధర్వనగర మనునగరము కలదు. ఆనగరమును గంధర్వరా జగు జీమూతకేతువు పరిపాలించుచుండెను. ఆతడు చిరకాలము సంతానహీను

డగుటచే పుత్రార్థియై కల్పవృక్షమును పూజించెను. ఆకల్పవృక్ష మాతని పూజకు సంతసించి వరమును వేడుమన జీమూతకేతువు నమస్కరించి నాకు సర్వగుణసమన్వితుడై, వంశోద్ధారకుడైన కుమారుని ప్రసాదింపుమని యడిగెను. కల్పవృక్ష మట్లే యగుగాక యని పల్కెను. రాజింటికి వచ్చెను. ఒక్కసంవత్సరకాలము గడువగనే జీమూతకేతునకు తేజశ్శాలియైన కుమారుడు గలిగెను. పుత్రజననమును జూచి తండ్రి మహాసంతోషముతో నగర మంతయు పుత్రోత్సవమును జేయించెను. బ్రాహ్మణులకు విరివిగ ధనరాసు లొసంగెను. బీదలకు - గోవులకు సంతోషమును గలిగించెను. పెద్దలయనుమతిని కుమారునకు జీమూతవాహనుడని పేరు పెట్టెను.

శుక్లపక్షచంద్రునివలె జీమూతవాహనుడు క్రమక్రమముగ వృద్ధినందుచు బండ్రెండువత్సరముల వయస్సుగల వాడైనంతనే శివపూజా ధురంధరుడై వేదములయందు, శాస్త్రములయందు, ధనుర్విద్యయందు నిరుపమానపాండిత్యమును సంపాదించి సాహసశౌర్య ధైర్యాదులయందు సాటిలేని మేటివీరుడై ధర్మాత్ముడని కీర్తి గాంచెను. తండ్రియైన జీమూతకేతువు కుమారునకు దగినకన్యకను విచారించి కడు వైభవముగ వివాహము జేసెను. రాజ్యములోని ప్రజ లందరు నతనిని మిక్కిలి ప్రేమించుచుండిరి. జీమూతవాహనుడు తండ్రివలెనే తానును కల్పవృక్షము నతి భక్తితో పూజించుచుండెను. కల్పవృక్షము ప్రసన్నమై జీమూతవాహనా! నీ కభీష్ట మేమో తెలుపుమన నత డోతరురాజా! నారాజ్యమందలి ప్రజ లందరును దరిద్రబాధ లేక సంతోషముతో సర్వసమత్వము గలిగియుండున ట్లనుగ్రహింపు మన నాకల్పవృక్ష మట్లే యనుగ్రహించెను. ఆకల్పవృక్షముయొక్క వరప్రసాదమువలన జీమూతకేతువురాజ్యమున దారిద్ర్యము, యీతిబాధలు లేక సకలజనులు సంతోషముగా నుండిరి,

తండ్రికొమరు లివిధముగ ధర్మాత్ములై జనరంజకముగా బరిపా లించుటజూడ జ్ఞాతుల కందర కితనిపై యసూయ జనించెను. ఎట్లయిన నాతనిరాజ్యమును స్వాధీనము జేసికొనవలయునని సమయముకొఱకె కను యెరుచు తరుణము రాగానే సైన్యసమేతులై వచ్చి గంధర్వనగర మును ముట్టడించిరి. ఆకస్మికముగ జ్ఞాతులు నగరమును చుట్టుకొనియున్న వృత్తాంతమును విని జీమూతవాహనుడు యుద్ధసన్నద్ధుడై తండ్రియనుజ్ఞ గోరెను. జీమూతకేతువు కుమారుని జూచి నాయనా! మనశరీరము లనిత్యములు. ధనము ప్రవాహము వంటిది. ఒకచోట నిల్చునది గాదు. పుట్టినప్రాణి గిట్టుట తప్పదు. 'జాతస్య మరణం ధృవం' అను నార్యోక్తి నెఱుగవా? ధర్మమును రక్షించుకొనుట ముఖ్యకర్తవ్యము. ఈయస్థిర రాజ్యభోగములకై యుద్ధమున కేగినయెడల నెందరు నిష్కారణముగా మనకొఱకు ప్రాణములను గోల్పోయెదరో? మన మెన్ని నిండుప్రాణము లను దీయవలయునో యోచించితివా? హింసాకరమైన కార్యములకు దూరముగ నుండవలయును. 'అహింసా పరమో ధర్మః' అని పెద్దలం దురు. పాండవాగ్రజు డగుధర్మరాజు భారతయుద్ధము పూర్తియైన తదు పరి జ్ఞాతిబంధుజనహత్యలను దలంచి మితిలేని దుఃఖములకు బాలయ్యె ను. కావున రక్తప్రవాహమును గల్గించుటకు నాహృదయము సమ్మతింప కున్నయది. అని పల్క జీమూతవాహనుడు తండ్రీ! మీయభిప్రాయ మట్లున్నయెడల రాజ్యమును జ్ఞాతుల కర్పించి తపస్సు జేసికొందము రండు అని పలుక తండ్రి సమ్మతించి రాజ్యమును జ్ఞాతుల కర్పించి యా తండ్రి కొమరు లిర్వురును మలయాచలపర్వతముపై కేగి యచ్చట నొకకుటీర మును నిర్మించుకొని యందు నివసించుచుండిరి.

ఆపర్వతముపై జీమూతవాహనుని కొకమునికుమారునితో స్నే హ మేర్పడెను. వా రిర్వురు తరుచుగ విహారార్థమై పోవుచుండిరి. ఒక నాడు వా రిర్వురును పర్వతముపై విహరించుచు నచ్చటికి సమీపమున

గల భవానీదేవిమందిరమున కేగిరి. అచ్చట నొకసుందరి వీణాపాణియై చెలికత్తెలతో వచ్చి భవానీదేవియెదుట గానము సేయుచుండెను. జీమూత వాహను డామెం గాంచి మోహపరవశు డయ్యెను. ఆ మెయు నావిద్యాధర పుత్రునిని జూచి విరాళి జెందెను. పరస్పరవీక్షణములవలన భావము లవ గతము లయ్యెను. కొంతవడి కెవరిత్రోవను వారు పోయిరి. నాటిరాత్రి జీమూతవాహనునకు నిద్ర పట్టలేదు. మరునాడు ప్రాతఃకాలముననే సుం దరీసందర్శనాపేక్షచే జీమూతవాహనుడు బయలుదేరి భవానీమందిర మును జేరెను. ఆసుందరియుఁ జెలికత్తెలతో నట జేరి దేవి కెదురుగ నిలు వబడి గానము సేయుచుండెను. జీమూతవాహనుడు కొంతసే పాగాన మాలించి చెలికత్తెం జేరి యీజగన్మోహిని యెవరు? అని యడుగ నామె యిట్లనియె. ఓసుందరయువకుడా! ఈమె మలయకేతుమహారాజ పుత్రిక మలయావతి. అనురూపవరుని గోరి దేవిని ప్రార్థింపుచున్నది. మీవృత్తాంత మేమో తెలిసికొనవచ్చునా? అని యడుగుటయు నాత డోయువతీ! గంధర్వనగరాధీశుడైన జీమూతకేతువునకు కుమారుడను. నాపేరు జీమూతవాహనుడు. దైవసంకల్పమువలన రాజ్యము పరులయ ధీన మగుటచే మే మీపర్వతమున వసించుచుంటిమి- అని చెప్పెను. మ లయావతి కొలదికాలమునుండి జీమూతవాహనునిపై గలమోహ మగ్గ ల మగుటచే తిరిగి చూచుచు వెడలిపోయి విరహతాపముచే మంచ ముపై పరుండెను. తల్లి మలయావతియొక్క పరితాపమును గ్రహించి భర్తతో విన్నవించి మహారాజా! మనకుమార్తె యుక్తవయస్కయై యు న్నది. వరనిర్ధారణ మొనర్పవలయును. అని పలుక మలయకేతుడు కుమారుడగు మిత్రావసువనువానిం బిలిచి మలయావతి కనుకూలవరుని వెదకి రమ్మని పలుక నతడు తండ్రీ! గంధర్వనగరాధీశ్వరుడును, విద్యాధర కులదీపకుడు నగు జీమూతకేతుమహారాజు పుత్రునితో మలయాద్రిపై నివసించియున్నాడు. అతనికుమారుని మలయావతి వలచియున్నది.

అనుటయు మలయకేతువు వెంటనే పరిచరులను బంపి జీమూతకేతుని పుత్రసహితముగా బిలువ నంపి తనయభిప్రాయ మెఱింగించెను. జీమూతకేతువు సంతోషముగ నంగీకరించెను. తదనంతర మొకశుభలగ్నమున మలయావతీజీమూతవాహనులకు మహావైభవముగ వివాహమును జేసిరి. వివాహానంతరము నూతనదంపతులు పెద్దలవలన నాశీర్వచనములను పొంది సుఖంబుగ గొలదిదినములు కాలము గడిపిరి.

ఒకనాటిప్రాతఃకాలమున జీమూతవాహనుడు మిత్రావసువను తనబావమరిదిని వెంట నిడుకొని మలయాద్రిపై విహరింపబోయెను. కొంతదూరము పోవ నతనికి తెల్లని ఎముకలప్రోవులు గుట్టలై పడియుండుట జూచి శ్యాలకునిజూచి బావా! యీయెముకల గుట్టలచరిత్ర మేమని యడుగుటయు మిత్రావసువు జీమూతవాహనుని జూచి ఇవి యన్నియు పాతాళ లోకమునందలి నాగులయెముకలు. ప్రతిదినము నొక్కొక్క నాగుడు పాతాళమునుండి వచ్చి గరుడున కాహారము కావలయును. ఇది నియమము. నాగులు చనిపోవ వానియస్థు లిట బడి యున్నవని చెప్పెను. వా రిర్వు రీవిధముగ మాట్లాడుకొనుచు కొంతదూరము పోవ జీమూతవాహనుడు తనమఱదితో నీ వింటికి బొమ్ము. నేను నానిత్యపూజావిధానమును పూర్తి గావించుకొని వచ్చెదను. అని చెప్పి మిత్రావసువును బంపి తా నాపర్వతమున దిరుగుచుండెను. ఇంతలో నతని కొకముదుసలియువతి రోదనము జేయుచు వచ్చుచున్నట్లు గన్పడ నామె సమీపమున కేగి ఓయవ్వా! నీ వెవ్వతెవు? ఏల యి ట్లేడ్చెదవు? నీదుఃఖమునకు గారణ మేమని యడుగ నావృద్ధురా లిట్లనియె. నాయనా! నే నొకనాగకాంతను. ఈదినమున గరుడున కాహార మగుటకు నాకుమారుడైన శంఖచూడునివంతు వచ్చినది. నా కాత డేకపుత్రు డగుటచే పుత్రమరణమునకు చింతించుచుంటిని. అని పలుక జీమూతవాహనుడిట్లనెను. ఓయమ్మా! నీవు చింతింపకుము. నే నొకవిద్యాధర పుత్రుడను.

నీకుమారునికి మారుగ నాశరీరమును గరుడున కొసంగి నీపుత్రుని కాపా డెదను. అనవుడు వృద్ధురా లో ధార్మికశిరోమణీ! వలదు. నీవంటి యుదా రులు లోకమున నుండవలయును. పెక్కుమంది జీవింపగలరు. నాకుమా రునికొఱకు విలువగల జీవితమును నాశనము జేసికొనవలదు. అని పలుక జీమూతవాహను డోనాగమాతా! 'పరోపకారార్థ మిదం శరీరం' అను నార్యోక్తిని వినవా? మరణ మెప్పుడును తప్పునది కాదు. కావున పరో పకారమునకై ప్రాణత్యాగము జేసికొనుట సర్వోత్తమము. కావున నీ కుమారుని వెనుకకు మరల్చుకొనుము. అని చెప్పుచుండ శంఖచూడుడు వచ్చి పెక్కువిధముల వారించెను. కాని యతడు తనపట్టుదలనుండి చలిం పలేదు. సత్యవాదులు తమవాక్కును వ్యర్థము జేయరుగదా! శంఖచూ డుడు విధిలేక తల్లితో దేవీమందిరమునకు వెడలిపోయెను. జీమూతవా హనుడు వధ్యస్థానమున నిలిచియుండెను.

చూచుచుండగనే గరుడుడు రెక్కలగాలిచే వృక్షములను బెకలిం ప జేయుచు భయంకరాట్టహాసముతో నరుగుదెంచి భీకరఖడ్గములవలె నున్న తనచంచువులతో జీమూతవాహనుని కరచుకొని పోవునపుడు శరీర మంతయు గాయములై పోవుటచే చేతిని గట్టుకొనియున్న భుజబందు అను ఆభరణము రక్తముతో దడిసి మలయావతిముందు బడెను. మల యావతి యాభుజబందును దీసి గుర్తించి నెత్తురిలో తడిసి పడుటచే భయాక్రాంతయై రోదనము జేయుచు తనతల్లిదండ్రుల కీవార్త నెఱింగిం చెను. వారును దుఃఖపడుచు కుమార్తెను వెంటనిడుకొని జీమూతవాహ నుని వెదకికొనుచు బయలుదేరి పోవుచుండగా దేవీమందిరమునుండి వచ్చుచుండు శంఖచూడు డెదురయ్యెను. శంఖచూడుడు వారివృత్తాం తమును తెలిసికొని పరుగునబోయి చూడ వధ్యస్థానమున జీమూతవాహ నుడు లేకుండుటచే గరుడు డతని నెతుకొనిపోయినట్లు నిశ్చయించి శర

వేగమున గరుడునిసన్నిధి కేగి గరుత్మంతుడా! వదలుము. నీవు భక్షింప తగిన నాగుడను నేను. ఆమహానీయుని వదలుము. అని మొర పెట్టుకొ నెను. గరుడుం డప్పుడే జీమూతవాహనుని శరీరమందలి రక్తమును పాన ము జేయుచు శంఖచూడుని మాటలను విని తెల్లబోయి యే మేమీ! ఇతడు నాగుడుకాడా? నేను మోసబడితినా యని తలంచి ముఖముపగల వస్త్రమును దీసి యోసాహసవంతుడా! నిజ మెఱింగింపుము. నీ వెవ్వరవు? అనవుడు గరుత్మంతా! నేను విద్యాధరుడను. జీమూతవాహానుడను. శంఖ చూడునితల్లికి వాగ్దాన మొనర్చితిని. అందులకుగా శంఖచూడునకు బదు లు నాశరీరమును నీకొసంగితి నారగింపు మన గరుత్మంతుడు జరిగిన సం గతిని తెలిసికొని వెంటనే దేవలోకమున కేగి యమృతముం దెచ్చి యత ని పై చల్లి బ్రదికిం చి యిట్లనియె. రాజపుత్రా! నీసాహసమునకు మెచ్చి తిని. నీపరోపకారబుద్ధి కానందించితిని. వర మడుగుమన జీమూతవాహను డిట్లనియె. అయ్యా! నేటినుండియు నీవు నాగులను భక్షింపవలదు. ఇది వరలో మృతు లైనవారిని బ్రతికింపుము. ఇదే నాకోర్కె యన గరుడు డతనియుదారబుద్ధికి సంతసించి నాగులను బ్రదికించి యతనికోర్కె దీర్చి జీమూతవాహనా! నీపరోపకారబుద్ధి కానందించితిని. కొలది దినములలో నీరాజ్యము నీకు స్వాధీనమగున ట్లనుగ్రహించితి నని చెప్పి గరుడుడు స్వ స్థానమున కేగెను.

జీమూతవాహనుడు తనవారిని గలసికొని యావద్వృత్తాంతము నెఱింగించి తల్లిదండ్రులతో, భార్యతో తిరిగి రాజ్యమును సంపాదించి సుఖంబుగ నుండెను. రాజా! శంఖచూడ జీమూతవాహనులలో నెవరి త్యాగము మెచ్చదగినది? అని గాడుగ విక్రముడు - శంఖచూడుని త్యా గమి గొప్పది. కారణ మేమనగా జీమూతవాహానుడు క్షత్రియుడు. పరో పకార మతనివ్రతము. ప్రాణత్యాగమున కలవాటుపడి యున్నవాడు.

శంఖ చూడుడు - రక్షింపబడియును - తిరిగి మలయావతి దుఃఖమును జూచి జీమూతవాహనుని రక్షించుటకును - తాను చంపబడుటకు నంగీకరించెను. కావున నతనిత్యాగమే గొప్పదని చెప్ప భేతాళుడు తిరిగి వృక్షశాఖను జేరెను. విక్రమార్కు డతని బట్టి తెచ్చుచుండెను.

# పదునారవకథ.

భేతాళు డిట్లు చెప్ప నారంభించెను. రాజా! వినుము. త్రివిక్రమ మనునగరము కలదు. ఆపట్టణమున రత్నదత్తు డనువర్తకుడు గలడు. అతని కున్మాదిని యనుపేరుగల సౌందర్యవతి యగుకుమార్తె కలదు. ఆమెకు యుక్తవయస్సు వచ్చినవెంటనే వివాహము జేయదలంచి, తండ్రి యైన రత్నదత్తుడు నగరము నేలు రాజసన్నిధి కేగి నమస్కరించి! మహారాజా! నాకొకకుమార్తె కలదు. ఆమె పేరు ఉన్మాదిని. మీవంటి మహారాజులు చేపట్టతగినది. కావున నామెను దేవర కిచ్చి వివాహము జేయ దలంచితిని. 'రత్నహారీతు పార్థివః' అనున్యాయము తామెఱింగియే యున్నారు. కావున నాకన్యారత్నమును గైకొనవలయునని ప్రార్థించుచున్నాను. అని పలుక ప్రభువు తనయూంతరంగికభటులను బిలిచి మీ రీవర్తకునివెంట జని యామెను జూచి యితడు చెప్పినట్లు సులక్షణసురూపసంపదలతో నొప్పుచుండెనేని నా కెఱింగింపుడు అని పంపెను.

రాజభటు లారత్నదత్తునితో బోయి యతనికుమార్తెయైన యున్మాదినిం గాంచి యామెచక్కదనమును జూచి యాశ్చర్యపడిరి. లేడి కన్నులబోలు నేత్రములు - త్రాచుపామువంటి జడ - ధనస్సునుబోలిన కనుబొమలు - తిలపుష్పమువంటి నాసిక - ముత్యములవంటి దంతపంక్తి - దొండపండువంటి యధరము - శంఖమువంటి గళము - కోకిలకూతవంటి పలుకులు - గలయా చంద్రముఖి - చంపకగంధి - హంసగమన - కోకిలవాణి - యారూపసంపదలగాంచి దేవేంద్రుని వలపింపగల్గు నీచక్కెర

బొమ్మను రాజు పెండ్లాడెనేని రాజకార్యములను, ప్రజలను, రాజ్యమును మరచి యీయామెతోడిదే లోకముగ దలంచి వెలికి రాజాలడు. కావున రాజున కీమె సౌందర్యమును తెలియనీయరా దని నిశ్చయించుకొని యా భటులు ప్రభుసన్నిధి కేగి మహారాజా! మే మామెను జూచితిమి. తమ వంటి ప్రభువులను జెట్టపట్టగల లక్షణము లామెదగ్గర నేమియు లేవు. అని చెప్ప ప్రభువు విరక్తుడై నీకుమార్తె నా కక్కర లేదని రత్నదత్తునకు వార్త నంపెను.

తదుపరి రత్నదత్తుడు తనకుమార్తెను సేనాపతియైన బలభద్రు డనువాని కిచ్చి వివాహము జేసెను. బలభద్రుడు భార్యతో నత్తవారింటనే యుండి రాజకార్యములయం దప్రమత్తుడై సంచరించుచు భార్యతో సుఖించుచుండెను. ఒకనాడు ప్రభువు గజారూఢుడై పట్టణము జూడ బయలుదేరెను. పురకాంత లందరును గవాక్షములనుండియు, మేడల పై నుండియు, మిద్దెలపై నెక్కియు ప్రభువును వీక్షించుచుండిరి. ప్రభువు రత్నదత్తుయొక్క మేడగలవీధిని వచ్చుచుండెను. రత్నదత్తుని కుమార్తెయైన ఉన్మాదని సర్వాభరణభూషితయై రంభోర్వశుల దిరస్కరించు సౌందర్యములో మేడపైనుండి రాజును వీక్షించుచుండెను. ప్రభువును మేడప్రక్కకు వచ్చునప్పటికి తల యెత్తిచూడ విద్యుల్లతవలె మెఱయుచున్న ఉన్మాదిని కనబడెను. రెప్పవేయక నిదానించి చూచి ఈమె మానవకాంతయా, దేవకాంతయా, యక్షకన్యయా? ఈజగన్మోహిని యెవ్వరై యుండునో యూహింపజాలక రాజు నగరు చేరినది మొదలు చింతాక్రాంతుడై యుండెను. అంతఃపురము విడిచి వెలుపలికి రాకుండుటచే నాశ్చర్యపడుచుండిరి. ఒక రిద్దరు రాజాంతఃపురసేవకులు సాహసించి ప్రభువును సమీపించి చింతకు గారణ మడిగిరి. రాజు వారిం జూచి తాను జూచిన సౌందర్యవతి వృత్తాంతము నెఱింగించి యామె యెవ్వరని యడిగెను. సేవకు లిట్లనిరి.

మహారాజా! ఆమె రత్నదత్తునికుమార్తె ఉన్మాదిని. ప్రభువుగారి కామె నీయదలంచి కబురుపంప తామక్కరలే దనుటచే సేనాపతి బలభద్రున కిచ్చి వివాహము జేసినాడని చెప్ప రాజు తెల్లబోయినాడు. తా నంపిన యంగరక్షకభటులు తన్ను మోసపుచ్చినారని యెంచి కోపమున నాభటుల బిలిచి వెనుక మీరు రత్నదత్తునికుమార్తెవిషయమై చెప్పినమాటలు నిజమేనా యని యడుగ వారు భయపడుచు దేవా! మే మసత్యము నాడినమాట నిశ్చయమే. కారణ మేమనగా? తా మా సుందరాంగి యొక్క మోహమున జిక్కితిరేని రాజకార్యములను బరిత్యజింపగలరు. దాన దేశమునకు గీడుగదా యని తలంచి యట్లు చెప్పితిమి. ఇంతేగాని వేరు కారణము లేదు. అని చెప్ప ప్రభువు వారిని పంపి చింతాక్రాంతుడై పరుండెను. నానాటికి రాజుగారి మనోవ్యాధి యధిక మగుటచే భటుల వలన సేనాపతి బలభద్రుడు తెలిసికొని యొకనాడు రాజుకడ కేగి సవినయముగ నిట్లనియె. మహారాజా! నామనవి నాలకింపుడు. మే మందరము దేవరసేవకులము. మాశరీరములు - ధనములు - తమయధీనము. నాయధీనములో నున్ననాభార్యయు దేవరకు దాసురాలు. కొనివచ్చి తమసేవకై యప్పగించెదను. తమకు చిత్తము వచ్చినట్లు వినియోగించుకొనుడన రా జిట్లనియె. పరస్త్రీ తల్లివంటిది. పరస్త్రీగమన మొనర్చిన ప్రభువు ఇహపరములకు రెండింటికిని చెడును. కావున నీవట్లు 'మాతృవ త్పరదారాంశ్చ పరద్రవ్యాణి లోష్ఠవత్' అను న్యాయము నాలోచింపు మన బలభద్రు డిట్లనియె. మహారాజా! ఆమె నాదాసి. మీయాత్మసంతృప్తి కొఱ కామెను పరిత్యజించి వేశ్యనుగా జేసి మీకడ కంపెదను. దేవర వారామెతో సుఖింపవచ్చును. అన రాజు గ్రుడ్లెఱ్ఱజేసి నీవు రెండు తప్పిదములు చేయదలంచితివి. కులస్త్రీని పరిత్యజించుట - రెండవది ఒకసాధ్విని బలాత్కారముగ పరపురుషసంపర్కమునకు బంపుట. ఈరెండింటిని జేసిన పిదప నాచే శిక్షింపబడుదువు. కావున మాటాడక పొమ్ము. నాపరితాప

మునకు శాంతి లేదు. అనవుడు సేనాపతి కింకర్తవ్యతామూఢుడై వెడలి పోయెను.

తదనంతరము సుమారు పదునైదుదినములకు రాజు మనోవ్యాధిచే పీడితుడై నానాటికి చిక్కి మంచ మెక్కి తుదకు మరణించెను. రాజు చనిపోయినతోడనే బలభద్రుడు రాజుగురువునుజేరి స్వామీ! ధర్మాత్ముడైన ప్రభువు చనిపోయిన స్వామిభక్తిగల సేవకుని కర్తవ్యమేమి? అని యడుగ తనజీవితములనుగూడ బరిత్యజించి ప్రభువు యొక్క యాత్మకు శాంతిని సమకూర్పవలయును. అని రాజగురువు చెప్ప బలభద్రుడు వెంటనే లేచి ఊరిబయట కాళీదేవాలయమునన్నిదిని చితి పేర్పించి దాని నంటించి తల్లీ! కాళీ! నాకు ప్రతిజన్మమున నిట్టి ప్రభువును సమకూర్పుము. అని పల్కుచు నామంటలలో నురికి ప్రాణములను వదలెను. ఉన్మాదిని యీవార్తను విని యొక్కపరుగున వచ్చి స్నానము జేసి బ్రాహ్మణులకు, సువాసినులకు బూజజేసి యగ్నికి నమస్కరించి తల్లీ! కాళీ! నాకు జన్మజన్మమునకు నిట్టిభర్తయే కావలయునని పల్కుచు నాచితిలో నురికి ప్రాణత్యాగము జేసి భర్త ననుసరించెను. రాజా వింటివా? ఈముగ్గురి మరణములలో నేవ మరణము విశేషమైనది? అని యడుగ విక్రమార్కుడు రాజమరణమే శ్రేష్ఠమైనది. కారణ మేమనగా? ప్రభువుకొరకు సేవకుడు చనిపోవుట ధర్మము. భర్త చనిపోయినవెంటనే సహగమనము జేయుట భార్యాధర్మము. కాని తాను వలచిన కన్య తనకు లభించుచున్నను ధర్మహాని కంగీకరింపక క్షత్రియ ధర్మమును గాపాడుకొని ప్రాణములను వదలిన రాజుమరణమే కొనియాడ తగినది. అని చెప్ప భేతాళుడు మరల చెట్టుమీద కెగిరెను.

## పదునేడవకథ.

విక్రముడు పట్టి తెచ్చుచుండ భేతాళు డిట్లు చెప్ప నారంభించెను. ఉజ్జయనీనగరమున దేవశర్మ యనుబ్రాహ్మణు డుండెను. అతనికి

గుణాకరు డను పేరుగల కుమారుడు గలడు. "కుపుత్రః కులనాశకః" అను రీతిని గుణాకరుడు దుర్గుణాకరుడై, దుష్కార్యముల కగ్రేసరుడై సప వ్యసనములకు బాల్పడెను. ద్యూతవ్యసనలోలుడై ధనమును బాడు జేయుచుండెను. ఇంటగల వెండిబంగారములను దొంగతనముగ గొనిపోయి జూదమున సమర్పించుచు వారనారీలోలుడై నిజభార్యను పరిత్యజించెను. తల్లిదండ్రు లెంత మందలించినను వినకపోవుటచే విసిగి యందరును కలసి యాగుణాకరుని దేశభ్రష్టుని గావించిరి.

గుణాకరుడు కొంతకాలము దేశాటన మొనర్చుచు నెక్కడను నిలువ నీడలేక నొకయరణ్యమున బ్రవేశించెను. ఒకపర్వతగుహలో తపస్సు జేసికొనుచున్న సిద్ధుని జూచి యతని సమీపమున కేగి నమస్కరించి మహాత్మా! నేను క్షుద్బాధచే పీడింపబడుచుంటిని. అని బలుక నాసిద్ధుడు జపము చాలించి యొకమనుష్యకపాలమున నాహార ముంచి గుణాకరుని ముందు బెట్టెను. దానిని జూచి యేవగించుకొని స్వామీ! నే నెప్పుడు నిట్టి పుర్రెలో దిని యెఱుంగను. ఇప్పు డెట్లు భుజింతునన నా సిద్ధు డొకమంత్రమును బఠించినంతనే యొకదివ్యసుందరి ప్రత్యక్ష మయ్యెను. నీ వీబ్రాహ్మణునకు పక్వాన్నముల నారగింప జేసి సంతోషపరచు మనగా నాసుందరి యాతని గొనిపోయి దివ్యహర్మ్యమున జేర్చి యందున్నతాసనమున గూర్చుండబెట్టి స్నానపానాదుల సంతృప్తుని జేసెను. మృష్టాన్నమును గుడువబెట్టి యొకహంసతూలికాతల్పముపై బరుండ జేసి నాటిరాత్రి యంతయు కేళీవిలాసములతో నతనిహృదయము నానందసాగరమున నోలలాడజేసెను.

గుణాకరు డీవిధముగ నామెతో నిష్టవినోదముల బ్రొద్దు గడపి పరుండెను. తెల్లవారునప్పటి కామేడయు, హంసతూలికాతల్పము, సుందరియు మాయమై తా నెప్పటియట్ల గుహాముఖద్వారమున బరుండి

ఝుండుటను దెలిసికొని యాసిద్ధుని జేరి రాత్రివిషయ మంతయు దెల్పి యిట్లనియె. స్వామీ! ఇది కలయా? లేక నిక్కువమా! యని యడుగ సిద్ధు డిట్లనియె. రాత్రి నిన్ను సంతోషపరచిన దొకయక్షిణి. నాయాజ్ఞచే నిన్నామె తృప్తి పరచినది. మంత్రశక్తివలన నా కామె స్వాధీనమైనది. అని చెప్ప గుణాకరు డతనిపాదములబడి మహాత్మా! నాకుగూడ నట్టిమంత్రము నుపదేశింపుడు. నే నాయక్షిణీవిద్యను సాధించెద నన నా యోగి యొకదివ్యమంత్రము నాగుణాకరున కుపదేశించి నీ వీమంత్రమును శీతకాలమున నలుబదిదినములు అర్ధరాత్రమున మొలలోతునీటిలో నిలువబడి స్థిరచిత్తుడవై జపము జేయుము. జపసమయమున బెక్కుభయోత్పాతంబులు కలుగును. ఎంతమాత్రము చలింపవలదు. అని పలుక గుణాకరు డావాక్యముల కంగీకరించి సిద్ధుడు చెప్పినట్లు నలుబదిదినములు జపమును ముగించి తిరిగి వచ్చెను. సిద్ధు డతనిం జూచి యింకొక నలుబదిదినము లగ్నిమధ్యమున గూర్చుండి జపము సేయవలయు నని చెప్ప గుణాకరుడు స్వామీ! ఒక్కమారు గృహమున కేగి మాస్వజనమును జూచి వచ్చి మీరు చెప్పినట్లు చేసెద నాజ్ఞ యిండని సిద్ధుని యనుమతి గైకొని బయలుదేరి స్వగృహము జేరెను. చిరకాలమున కింటికి వచ్చిన గుణాకరుని జూచి తలిదండ్రు లెంతయు సంతసించిరి. కుమారునిబుద్ధి మారియుండు ననుతలంపుతో తండ్రి కుమారునిం జేరి యిట్లనియె. కుమారా! ఇన్నిదినము లెట నుంటివి? జరిగిన దేదో జరిగెను. ఇంకనైన నామాటలను వినుము. తలిదండ్రుల హితోపదేశమును బెడచెవిం బెట్టుటకన్న దోషము వేరులేదు. ఆశ్రమములలో నత్యుత్తమమైన గృహస్థాశ్రమమున నుండియు భార్యాపరిత్యాగము జేయుట మహాపాతకము. తల్లిదండ్రుల ఋణము దీర్చుట, వంశమునకు బేరుదెచ్చుటయే సుపుత్రుని ధర్మము. కావున నింకనైన నింటికడనుండి ధర్మతత్పరుడవై

నీధర్మపత్నితో గలసి సత్కార్మాచరణతత్పరుడవై వర్ధిల్లు మన గుణాకరు డిట్లనియె. తండ్రీ!

శ్లో. జన్మదుఃఖం జరాదుఃఖం జాయాదుఃఖం పునఃపునః।
సంసారసాగరం దుఃఖం తస్మా జ్జాగ్రత జాగ్రత॥
మాతా నాస్తి పితా నాస్తి నాస్తి బంధుసహోదరాః।
అర్థం నాస్తి గృహం నాస్తి తస్మా జ్జాగ్రత జాగ్రత॥

అని పెద్దలు పల్కియున్నారు. ఎవ్వరికి ఎవ్వరును లేరు. ఇ దంత యు మాయశరీరము. రక్తమాంసపురీషమూత్రములపాత్ర. దుర్గంధభూయిష్టము. ఒక్కనా డీదేహమును శుభ్రము చేయనియెడల మరునాటికి దుర్వాసన బయలుదేరును. ఇట్టిదేహమున కీవ్యామోహ మేల? మలభరితమైన ఘటమును శుద్ధిచేసినమాత్రమున లాభ మేమి? అట్లనే శరీరమున పైభాగము శుద్ధిచేసినంతలో పాపవాసన వదలదు. అంతశ్శుద్ధి కావల యును. కావున మీ రింక నాపై వ్యామోహమును వదలుడు. నే నొక మహాత్ము నాశ్రయించితిని. ఇంకమీద యోగసాధనము జేసి యంతశ్శుద్ధిని గావించుకొనెద నని చెప్పి మరల బయలుదేరి సిద్ధునికడకు వచ్చి పంచాగ్నిమధ్యమున గూర్చుండి నలుబదిదినము లామంత్రమును జపించెను. కాని యక్షిణి ప్రత్యక్షము కాలేదు. గుణాకరుడు యోగిని సమీపించెను. యోగి యతనిం జూచి యక్షిణి ప్రత్యక్షము కాలేదా యన కాలేదని చెప్పెను. రాజా! గుణాకరుడు విధ్యుక్తముగ జపించినను యక్షిణి ప్రత్యక్షము కాకపోవుటకు గారణ మేమన విక్రము డిట్లనియె. ఆ సాధకున కేకాగ్రచిత్తము కుదురకపోవుటచే యక్షిణీదేవత ప్రత్యక్షము కాలేదు. చంచలచిత్తునకు మంత్రసిద్ధి కలుగదు. గుణాకరుడు ప్రథమమున నిష్కామబుద్ధితో గాక కామేచ్ఛతో నుపదేశము నందెను. తదుపరి సగము జపముజేసి రసనారల జూడబోయి జపవిఘ్నము జేసికొనెను. ఇం

దువలన సిద్ధుడు మనమున నిశ్చయించలునకేల మంత్రోపదేశమును జేసితివా యని విచారపడెను. ఇన్ని కారణములవలన నాసాధకునకు మంత్రసిద్ధి కలుగలేదు. అని చెప్పి భేతాళు డెగిరి వృక్షశాఖను వ్రేలాడుచుండెను. విక్రముడు తిరిగి యాతనిబట్టి తెచ్చుచుండెను.

# పదునెనిమిదవకథ.

భేతాళు డిట్లు చెప్ప నారంభించెను. రాజా! వినుము. కదళీపురమును సుదక్షిణు డనురాజు పాలించుచుండెను. ఆనగరమున ధనాఢ్యు డను వైశ్యశిరోమణి గలడు. ఆతనికి ధనవతి యనుకన్యక గలదు. ఆధనవతిని పదవయేటనే గౌరీదత్తు డనేవాని కిచ్చి వివాహము చేసిరి. కొంతకాలమున కాధనవతికి కుమార్తె పుట్టెను. తల్లిదండ్రు లామెకు మోహిని యని పేరు పెట్టిరి. మోహిని పదేండ్లునిండునప్పటికి గౌరీదత్తుడు చనిపోయెను. భర్త పోయినయనంతరము మరదులు, బావగార్లు మొదలగుబంధుజను లామెయింట గలసర్వస్వము నపహరించి వెడలగొట్టిరి. ధనవతి కుమార్తెతోగూడ వేరొకయూరి కేగుచు త్రోవ తప్పి రాత్రివేళ నొక శ్మశానముగుండా పోవుచు చీకటిలో కనుబడక పోవుటచే శూలారోపణ శిక్షను బొందిన యొకపురుషుని పై బడెను. వా డదివరకే భయంకరమైన బాధ పడుచుండుటచే అబ్బాయని మూలిగి ఎవ్వ రిట్లు నాపై బడి నా బాధను వృద్ధి చేసినారు? అని యడుగ ధనవతి అయ్యా! చీకటిలో త్రోవ తెలియకపోవుటచే నావలన నీ కట్టిబాధ గల్గినది. కోపింపకుము. నీ వెవ్వరవు? నీకిట్టి శిక్ష కల్గుటకు గారణ మేమి? అని యడుగ నాత డిట్లనియె. నే నెవ్వరైన నేమి? ఈదినములలో నెవ్వరి కెవరును లేరు. ఒకరికష్టములకొకరు కారకులు గారు. భాగస్వాములు గారు. చివరకు భార్యాపుత్రులైనను తనకష్టములందు బాలుగొనరు. ఇట్టిస్థితిలో ఎవ్వరని యడిగిన నేమి తెల్పుదును? నే నొకచోరుడను. ప్రభువువలన నీ శిక్షను పొంది

తిని. మూడుదినము లైనను ప్రాణములు పోవకున్నవి. అని చెప్పగా ధన వతి ప్రాణములు పోకుండుటకు కారణము కలదా యన చోరు డోపడతీ! కారణము దెల్పెదను నాకు చిరకాలమునుండి వివాహ మాడవలయునని కోరిక గలదు. ఆవాంఛ తీఱలేదు. అందువలన ప్రాణములు పోకున్నవి. నీకుమార్తెను నా కిచ్చి వివాహము జేసితివేని నేను దాచిన లక్షలకొలది మొహరీలను నీకు స్వాధీనము జేసెదను.

అనవుడు ధనవతి యామాటలను విని జాతులచే సర్వము కోల్పోవబడిన దగుటచే ధనాశచే తనకుమార్తెయైన మోహినిని వాని కిచ్చి పెండ్లిచేయ దలంచి యిట్లనియె. నేను దౌహిత్రుని జూడవలయు నని కోరుచుంటి. ఆసన్నమరణుండ వగునీవలన నాకోర్కె యెట్లు నెఱవేరును. అని యడుగ నత డిట్లనియె. నీకుమార్తె యవ్వనవతి యయినంతనే యొక బ్రాహ్మణునకు అయిదువందల మొహరీల నొసంగి మూడురాత్రులు నీకుమార్తె నతనిస్వాధీనము జేసితివేని నీకు దౌహిత్రలాభము కలుగునని చెప్ప ధనవతి తనకుమార్తె మెడలో నాచోరునిచే సూత్రధారణ జేయించి వివాహము పూర్తి జేసెను. చోరుడు ధనవతితో ఇచ్చటికి తూర్పుదిశగా బోయిన నొకకొండ కన్పడును. దానిప్రక్క నొక కదంబవృక్ష మున్నది. ఆవృక్షముక్రింద మొహరీల నిధి యున్నది. త్రవ్వుకొని దానిని స్వాధీనము జేసికొనుము. అని చెప్పి కొంతసేపటికి ప్రాణములను వదలెను. ధనవతి చోరుడు చెప్పినగుర్తు ననుసరించి యావృక్షమును సమీపించి యచట త్రవ్వి మోయఁగలిగినన్ని మొహరీలను మూటగట్టికొని పుట్టినింటికి బోయి కొంతకాల ముండి తిరిగి యత్తవారియూరు జేరి యొకపెద్దమేడ నద్దెకు గొని కుమార్తెతో నివసించియుండెను. కొంతకాలమునకు మోహిని నవయౌవనవతియై స్నేహితురాలితో మేడపై నిల్చుండి వీథి వైపునకు జూచుచుండెను.

ఒకబ్రాహ్మణయువకుడు పాతికవత్సరముల యెల్లప్రాయంపుటందగా డొక డావీధినుండి పోవుచుండగా మోహిని చూచి వాని చక్కదనమునకు మెచ్చుకొని స్నేహితురాలితో చెలీ! ఆవిప్రయువకుని నాతల్లికడకుం గొనిపొమ్ము అని పల్కెను. వెంటనే యాచెలికత్తె క్రిందకు దిగి యాబ్రాహ్మణుని వెంటబెట్టుకొని ధనవతిని సమీపించి యిట్లనియె. మోహినీదేవి పనుపున నీబ్రాహ్మణుని తమకడకుం గొనివచ్చితినని బలుక ధనవతి యతని యందచందముల జూచి బ్రాహ్మణోత్తమా! నాకుమార్తెయైన మోహిని నీయందమునకు వలచినది. ఆమెకోరిక దీర్చినచో నీకెంతయో బహుమతి నొసంగెద నని పలుక నాత డంగీకరించెను. అంతట నావిప్రుడు మోహినితో మూడుదివారాత్రములు బ్రహ్మసందసుఖ మనుభవించెను. చెలికత్తెలు నాలుగవనాడు మోహినితో ప్రథమరాత్రి వృత్తాంత మేమని యడుగ నామె సిగ్గుతో లేనగవు మొగమున నలంకరింప చెలీ! ఏమని చెప్పుదును? మీ రందరు నన్ను గదిలోనికి బంపి తలుపులను బిగించిరి. నేను సిగ్గుతో తలవంచుకొని నిల్చుంటిని. ఆయందగాడు నన్ను దనపాన్పుపైకి లాగుకొని బాహుదండములతో కౌగలించుకొనువరకు జ్ఞప్తియున్నది. తదనంతర మేమి జరిగెనో నే నెఱుంగ నని చెప్పెను. విప్రునితో మోహిని యొకనెలదినములు సుఖించునప్పటి కామెకు గర్భచిహ్నములు పొడగట్టుటచే ధనవతి బ్రాహ్మణుని బిలిచి నియమము ననుసరించి అయిదు వందల మొహరీల నొసంగి పంపివేసెను.

మోహిని గర్భవతియై పదియవమాసమున కుమారుని గనెను. కనినయారవనాడు రాత్రి ధనవతికి స్వప్నమున సర్పభూషణుడగు కపాలమాలికాధారియు, త్రిశూలహస్తుడగు విప్రుడు గన్పడి నీమనుమని యొకపేటికలో నుంచి వేయి వరహాల మూట నందుంచి రాజద్వారమునకు ముందుభాగమున తెల్లవారుటకు ముందు దుంచి రమ్ము. ఇది యీశ్వరాజ్ఞ

యని చెప్పుటయు ధనవతి వెంటనే లేచి యీశ్వరుడు చెప్పిన ట్లాశిశువును పేటికలో నుంచి వరహాలతో గూడ యథాస్థానమున నుంచి యింటికి జేరెను. ఆరాత్రియే రాజైన సుదక్షిణునిస్వప్నమున వెనుకజెప్పబడిన విప్రుడు ప్రత్యక్షమై రాజా! నీవు ప్రాతఃకాలమున లేచి చూచితివేని నీరాజద్వారమునుం దొకపేటిక యుండును. అం దొక శిశు వుండును. తీసుకొనివచ్చి కాపాడుము. ఆశిశువే నీరాజ్యమునకు కర్తయని చెప్పి మాయమయ్యెను. రాజు లేచి తెల్లవారుజామున ద్వారమును దెరచి చూడ పేటిక గనపడెను. తెరచిచూడ మగశిశువు, వేయివరాల మూటనుం దుండెను. రా జాద్రవ్యమును ఖజానా కంపి శిశువును గొనిపోయి తనభార్యయైన రాణిచేతి కందిచ్చెను. సాముద్రికశాస్త్రజ్ఞుల గొనివచ్చి పిల్లవాని లక్షణములను జూచి ఫలితమును దెల్పుడని యడుగ వా రందరును యాశిశువును పరీక్షించి మహారాజా! ఈశిశువు మహారాజలక్షణములు కలవాడు. దేశాధిపతి యగునని చెప్పిరి. ప్రభు వావిప్రులకు విశేషధనమును బహుమతి యొసంగి యొకశుభదినమున నామకరణమహోత్సవము జరిపి హరదత్తుడని పేరుపెట్టి యాబాలుని ప్రేమతో బెంచుచుండిరి.

హరదత్తుడు ద్వాదశవర్షవయస్కు డగునప్పటికి వేదములు - శాస్త్రములు- అరువదినాలుగుకళలు- ధనుర్వేదము- మొదలగువాని యందు నైపుణ్యము నార్జించెను. కొలదివత్సరములు గడచినతమపరి వృద్ధరాజదంపతులు కాలగతిం జెందిరి. హరదత్తుడు పైతృకకర్మల నెరవేర్చినయనంతరము మంత్రులు హరదత్తుని రాజుగా నొనర్చిరి. హరదత్తుడు రాజై బాలు డయ్యును ప్రజారంజకముగా రాజ్యము నేలుచు నొక శుభముహూర్తమున తీర్థయాత్రలకు బయలుదేరి కాశీ- ప్రయాగలను జూచి గయలో పితృదేవతలకు పిండప్రదానము జేయబోవుచు ఫల్గునీ

నదీతీరమున జేరి యథావిధిగ పితరులకు పిండదాన మొనర్చెను. తత్సమయమున హరదత్తునిచేతిపిండముల నందుకొనుట కానదిలో నుండి మూడుహస్తములు పైకి లేచెను రాజా! హరదత్తు డాపిండముల నెవరి చేతిలో నుంపవలయునో దెల్పు మన విక్రము డిట్లనియె. వివాహ మాడినదొంగయే పిండముల నందికొన నర్హుడు. కారణ మేమంగా బ్రాహ్మణునివీర్యమును ధనవతి అయిదువందలమొహరీలకు కొనియుండుటచే పిండాధికారమును గోల్పోయెను. రాజాశిశువుపోషణమునకై పెట్టిలో పెట్టినవేయివరహాలమూటను గ్రహించుటవలన పిండగ్రహణాధికారమును పోగొట్టుకొనెను. కావున చోరుడే గ్రహింప దగును. అని చెప్ప భేతాళుడు మరల చెట్టుపై కెగిరెను.

## పందొమ్మిదవకథ.

తిరిగి పట్టితెచ్చుచున్న విక్రమార్కునితో భేతాళుడిట్లు చెప్ప నారంభించెను. చిత్రకూట మనునగరమును రూపదత్తు డనురాజు పాలించుచుండెను. ఆ రాజొకనాడు వేటకై యరణ్యమున కేగి వేటాడి యలసి యొకసరోవరముం గాంచి యందు దాహము దీర్చుకొని తీరమున గుఱ్ఱముపై నున్నజీను పరచుకొని విశ్రమించెను. ఆసరోవరమున కెదురుగ నొకమునీంద్రుని యాశ్రమము, చిన్నపూలతోటయు గలవు. ఒకగడియకాలమున కాతోటలోనికి చక్కనిమునికన్య వచ్చి పూవులను గోయుచుండెను. రాజామునికన్యకను జూచి కామమోహితుడై తానుగూడ నాతోటలోనికి బోవ యామునికన్య రాజుం గాంచి ప్రక్కకు దప్పుకొనియె. రాజామెను జూచి యోకన్యకామణీ! మీయాశ్రమమున నతిథిపూజ యొనర్చుట లేదాయని యడిగెను. మునికుమారి యామాటను వినియు బ్రత్యుత్తర మీయక నొక్కమాఱాతని జూచి ప్రక్కకు తిరిగెను. రాజు మరల నిట్లనియె.

సుందరీ! నామాటకు బదులు పలుక వేమి? ఆశ్రమమునకు వచ్చిన యతిథి గొప్పవాడైనను, కొద్దివాడైనను సరియే- కులీనుడైనను, కులహీనుడైనను, సరియే- దుర్మార్గుడైనను సన్మార్గుడైనను సరియే- పూజనీయుడని పెద్దలు పల్కుదురుగదా! ఆశ్రమమునకు వచ్చిన నన్ని ట్లుపేక్షింతు వేల యని పలుక నామునికన్య మాటాడలేదు. ఇంతలో మునీంద్రు డాప్రదేశమున కరుదెంచెను. రాజాముని కి నమస్కరింప నాఋషి యతనిని దీవించి వచ్చినకారణము నడిగెను. మునీంద్రా! వేటా డవచ్చితి నని విన్నవింప నాముని రాజా! వేట యొకగొప్పవ్యసనము. నీవంటి ధర్మప్రభువు లావ్యసనమున దగుల్కొనరాదు. అని పలుక రా జిట్లనియె. మునీశ్వరా! మీరు పల్కెడి సుభాషితములను వినగోరిక కలదు. వచింపు డన మునీంద్రు డిట్లనియె. రాజా! సావధానుడవై వినుము. తృణమును భక్షించుచు, జలపానము జేయుచు, నిర్బాధకముగ వనమున దిరుగు ప్రాణికోటిని జంపరాదు. దాన పాపము కలుగును. ఫలములను భక్షించుచు, వియత్పథంబున నెగురుచు జీవించుపక్షులను హింసించుట నరకహేతువు. శరణు జొచ్చిన ప్రాణినిగాని భయముచే పాఱిపోవుచున్న ప్రాణినిగాని సంహరించుట మహాపాపము. క్షమకన్న మించిన తపము- సంతోషమునకు మించిన సుఖము- మిత్రత్వమునకు మించిన ధనము కానరాదు. దయయే పరమధర్మము. స్వభార్యయం దనురాగము- పరస్త్రీపరాఙ్ముఖత- సత్యవాదియై యుండుట మాన వుని ముఖ్యకర్తవ్యములు. రాజుభార్య-మిత్రునిభార్య- తొమ్మిదేండ్లకన్యక- ఎనిమిదినెలలగర్భిణిని- సంగమించినవాడు రౌరవాదినరకముల పాలగును. రాజా! ధర్మవిమర్శన మతిసూక్ష్మమైనది.

మునీంద్రు డీవిధముగ ధర్మోపదేశమును జేయ రాజు విని తాప సోత్తమా! తాము చెప్పినట్లాచరింతుననన ముని సంతుష్టుడై రాజా!

నాయాశ్రమమునగల కన్యకామణిని నీకు కానుకగా నర్పించుచుంటిని. ఆమెను భార్యగా పరిగ్రహింపుమని పల్కి యాసుందరిని పిలిచి రాజు చేత నామెచేతి నప్పగించెను. రూపదత్తుడు సంతసముతో మునికి వందన మొనర్చి యాసుందరిని వెంట నిడుకొని నగరమునకు బోవుచు రాత్రివేళ నాయడవిలో నొకచెట్టుక్రింద విశ్రమించిరి. అర్ధరాత్రివేళ నాచెట్టుమీద నుండి బ్రహ్మరాక్షసుడు క్రిందకు దిగి రాజును మేల్కొల్పి రాజా! నీభార్యను భక్షించెద నని పల్కెను. రాజు భయకంపితుడై నీ వట్లు చేయవలదు. నాభార్యను వదలితివేని నీవేది కోరిన నొసంగెదను. అన వుడు బ్రహ్మరాక్షసుడు రాజా! నేటికి నారసుదినములలో నొక బ్రాహ్మ ణబాలుని నాకు బలి యిచ్చితివేని నీభార్యనువదలెదనని చెప్పెను. రా జం దుల కంగీకరించి తననగరమున కరుగుదెంచి ఎవరైన బ్రాహ్మణదంప తులు తమకుమారుని బహ్మరాక్షసబలికై ప్రభువున కొసంగినయెడల రెండువందల మణుగుల బరువుగల బంగారపువిగ్రహము బహుమతిగా నొసంగబడునని చాటించెను. ఆరుదినములవరకు నెవరును రాలేదు. ఆయూరిలో నొకవిప్రకుటుంబము కలదు. ఆదంపతులకు ముగ్గురు కుమారులు కలరు. ఆయింటియజమాని కాబంగారువిగ్రహముపై యాస గలిగి భార్యతో ముచ్చటింపగా నామె తనకడగొట్టుపుత్రు నీయ నంగీకరించలేదు. తండ్రి పెద్దకొమారు నీయ నిష్టపడలేదు. అందరును గలసి రెండవపుత్రుని ప్రభువున కప్పగించి యాబంగారువిగ్రహమును దెచ్చుకొనిరి. ఏడవనా డాబాలుని స్నానము జేయించి, నూత్నవస్త్రముల నలంకరించి, పుష్పమాలాధరునిగ నొనర్చి వధ్యస్థానమునకు గొనివచ్చిరి. బ్రహ్మరాక్షసుడు వచ్చి సిద్ధముగ నుండెను. ఆవిప్రబాలకుడు మరణసమ యమున నొకమారు పక్కున నవ్వి తదనంతరము మహాధైర్యముతో తనకు పాఠశాలలో గురువులు చెప్పిన నారాయణసంస్మరణ జేసికొనుచు

ఖడ్గఘాతమున కెదురు జూచుచుండెను. రాజు కత్తియెత్తి నరకబోవు చుండ బ్రహ్మరాక్షసు డాగమని పల్కి యాబాలుని జూచి బాలకా! మరణసమయమున నీ కీధైర్యము, సంతోష మెట్లు కలుగుచున్నదన నాబాలుడు అయ్యా! "జాతస్య మరణం ధృవం" అని పెద్ద లందురు. కావున మరణమునకు వెరువ నేల? నాయట్టి నిష్ప్రయోజకుడు మరణింప వలసినదే కావున సత్వరముగ మీకార్యమును బూర్తి జేసికొనుడని పల్కుచు నారాయణభజనము జేయుచుండెను. బ్రహ్మరాక్షసు డాబాలుని హృదయగతాభిప్రాయమునకు, మనోధైర్యమునకు, దైవభక్తికి సంతసించి బాలకా! నిన్నుజూడ సంతసమైనది. నీయభీష్టము నడుగుమన నతడు రాజపత్నిజీవితము నడిగెను. వానిపరోపకారబుద్ధికి సంతసించి బ్రహ్మరాక్షసుడు కోరినవర మిచ్చి వెడలిపోయెను. రాజా! మరణసమయమున నాబాలు డేడ్చుటకు మారు నవ్వినకారణమును దెల్పుమన విక్రమార్కు డిట్లనియె. బాల్యమున తల్లి రక్షించును. పెద్దవాడైన పిదప తండ్రి కాపాడును. ప్రభువైనవా డసహాయులకు తోడ్పడును. ఈమూడుధర్మములు నావిషయమున విఫలములైనవి. తల్లిదండ్రులు పుత్రవాత్సల్యమును వీడి ధనాపేక్షచే మృత్యుముఖమున నప్పగించిరి. ప్రభువు స్వార్థపరుడై భార్యకొఱ కొకవిప్రబాలకుని నిస్సహాయుని వధింప నెంచెను. ఆహా! ధర్మమున కెట్టిపాటు వాటిల్లినది. దైవమాయ. అని తలంచి యాబాలుడు నవ్వెను. అని చెప్ప భేతాళుడు మరల చెట్టుపై కెగిరెను. విక్రము డాతని బట్టి క్రిందకు దీసికొనివచ్చెను.

## ఇరువదవకథ.

భేతాళు డిట్లు చెప్ప నారంభించెను. విశాలపుర మనునగరమున అర్థదత్తుడను వర్తకుడు కలడు. అతని కనంగమంజరి యను సౌందర్యవతియైన కుమార్తె కలదు. ఆమెను కమలపురనివాసియైన మోహను డను వాని కిచ్చి వివాహ మొనర్చిరి. ఆమోహానుడు వివాహ మాడినకొలది

సనములకే వ్యాపారార్థమై పరదేశముల కేగి వర్తకకార్యమున మునింగి బహుకాలమైన నింటికి రాలేదు. అనంగమంజరి పెద్దదై నవయవ్వనవతియై యుండుటచే పతిసుఖ మెఱుగక కామేచ్ఛగలదై యుండెను. ఒకనాడు చెలికత్తెతో మేడపై నిల్చుండియుండ మారసమాన సుందరుడగు బ్రాహ్మణు డొకడు త్రోవను బోవుచు తలయెత్తి చూచెను. ఇర్వురును బరస్పరసందర్శనముచే మోహమగ్నులైపోయిరి.

కొంతకాల మట్లుండి యా కమలాకరుడను పేరుగల విప్రయువకుడు తనమిత్రునియింటి కేగెను. అనంగమంజరి తన శయనగృహమున జేరి మన్మథాగ్నిచే తపింపబడుచు మంచముపై బరుండియుండెను. నిద్రాహారములను వదలెను. ఈమెభావ మెఱింగిన చెలికత్తె మెల్లగ నొకనాడు ప్రక్కజేరి సఖీ! నీహృదయమును గుర్తెరింగితిని. నీమానసచోరు డెవ్వడో నా కెఱింగింపుమన యనంగమంజరి తాను జూచిన విప్రయువకుని వృత్తాంతమును వచించి యాసొగసుకానిని నాకు సమకూర్పవేని నా ప్రాణములు నిలువవు. ఒక్కనిముస మొకసంవత్సరముగ నున్నదనగా నా చెలికత్తె వెంటనే బయలుదేరి యాకమలాకరుని వృత్తాంతమును విచారించి తెలిసికొని యాతని మిత్రునియింటి కేగి కమలాకరుని జూచెను. కమలాకరు డాయనంగమంజరీవియోగమున మితిమీరిన విరహతాపము జెందుచుండెను. చెలికత్తె మెల్లగ నతని సమీపించి తా వచ్చినకార్యము నెఱింగించి అనంగమంజరి నీవియోగమున మరణావస్థలో నున్నది. నేటి రాత్రి నీవు మాయింటికి వచ్చితివేని యామెతో సమాగమ మగునట్లు జేసెదనని చెప్ప నతడు సరేయని యంగీకరించెను. చెలికత్తె యా వృత్తాంతము ననంగమంజరితో జెప్పుటకై పోవ విరహవేదనకు తాళజాలక కంఠమున ఉరి బెట్టుకొనుచుండ చెలికత్తె వచ్చి తప్పించి యిట్లనియె. సఖీ! ప్రాణత్యాగము నేల జేసెదవు? బ్రదికియుండిన సుఖములు బడయవచ్చును. నేటిరాత్రి మాయింటికి వచ్చితివేని నీప్రియు

నితో సమావేశమును గలిగించెదను. అని చెప్పి యామె నూరడించి
యింటికి బోయెను. కమలాకరు డారాత్రి అనంగమంజరిని కూడుటకై
చెలికత్తెయింటికి బోవ నాదాసి యాతని గూర్చుండబెట్టి తనప్రాణసఖిని
పిలువబోయి గదిలో బ్రవేశించి చూడ అనంగమంజరి విరహవేదనకు
నిలువజాలక ప్రాణత్యాగము జేసెను. దాసి విచారముతో నింటి కేగి
కమలాకరున కీవృత్తాంతము నెఱింగింప నదివరకే విరహాగ్నిచే దహింప
బడుచున్న కమలాకరుడు అనంగమంజరీమరణవార్తను వినినతోడనే తన
ప్రాణములను వదలెను.

మరునాడు శ్మశానమున రెండుచితులలో రెండుశవములు దహన
మగుచుండెను. అనంగమంజరిభర్త పరదేశమునుండి యాత్రోవనే వచ్చు
చు చితులను జూచి జరిగినసంగతిని తానుగూడ దెలిసికొని నాచితిలో
నురికి ప్రాణత్యాగ మొనర్చెను. రాజా! వీరిమువ్వురిలో నధికకామార్తు
లెవరు? అని యడుగ రాజిట్లనియె భర్తయే కామార్తుడు అతని
ప్రేమయే కొనియాడ దగినది. కారణ మేమనగా సుందరపురుషుని స్త్రీ
లును, పురుషులును వలచుట స్వభావమేకాని తనభార్య అన్యపురుషుని
వలచి వానికై ప్రాణత్యాగ మొనర్చినసంగతి యెఱింగియు నట్టిభార్యకై
ప్రాణత్యాగ మొనర్చిన మోహానుని ప్రేమ నిష్కళంకము. అని చెప్ప
భేతాళుడెగిరి వృక్షశాఖ నంటుకొనెను. విక్రముడు మరల నాతని యథా
స్థానమునకు బట్టి తెచ్చెను.

# ఇరువదియొకటవకథ.

భేతాళుడిట్లు చెప్ప నారంభించెను. రాజా! వినుము. కళింగదేశ
ములో యజ్ఞశర్మ యనుబ్రాహ్మణుడు గలడు. అతనికి రూపవతి యను
పేరుగల భార్య గలదు. ఆయజ్ఞశర్మ వేదశాస్త్రములు జదివి పెక్కుయజ్ఞ
ములను జేసెను. కొంతకాలమునకు రూపవతి గర్భవతియై చక్కనికుమా
రుని గనెను. తల్లిదండ్రులు లాబాలుని ప్రేమతో బెంచుకొనుచుండిరి. అయి

దవయేడు వచ్చినంతనే యజ్ఞశర్మ బాలునకు కేశఖండనము జేయించి ఆచార్యునికడ చదువ బంపెను. సూక్ష్మబుద్ధిగల యాబాలుడు పదురెండు వత్సరముల ప్రాయము వచ్చునప్పటికి పెక్కువిద్యలలో ప్రవీణు డయ్యెను. తండ్రి కుమారున కుపనయనము గావించి వేదాభ్యాసము జేయించుచుండెను. పదునారువత్సరముల ప్రాయము వచ్చునప్పటికె ఆబాలుడు వేద శాస్త్రములను జదివి సంపూర్ణ పాండిత్యము నార్జించెను. కాల మొక్క రీతిగ గడువబోదుగదా! సుఖములు మేఘచ్ఛాయవలె చంచలములు. శరీరములు బుద్బుదప్రాయములు.

ఆబాలునకు శరీరమున నొకవిధమగు వ్యాధి జనించుటచే కొలది దినములకు మృతు డయ్యెను. యజ్ఞశర్మ - రూపవతియు కుమారుని కళేబరము పైబడి పెక్కుగతుల విలపించిరి. అతని గుణములను దలంచుకొని రోదన మొనర్చిరి. కాని లాభ మేమి? మరణించినవారు వత్తురా? తమ పరి బంధుగణ మంతయు గలసి యాకళేబరమునకు సంస్కారము నిమిత్తమై శ్మశానమునకు గొంపోయిరి. బంధువు లందరు శవమును జూచి ఇట్లు తలపోసిరి. చూచితిరా? చనిపోయినముఖ మెంతకాంతిగా నున్నదో? ఎంత చక్కనిబాలుడు! అని దహన సంస్కారమునకు ప్రయత్నించుచుండిరి.

ఇంతలో నటకు కొంచెముదూరములో తపము జేసికొనుచున్న నొకయోగి యాబాలకునికళేబరమును జూచి యిట్లు తలపోసెను. ఈ బాలుడు సుందరుడు. నే నీకళేబరములో ప్రవేశించితినేని యింకను చాలకాలము ప్రాపంచికభోగముల ననుభవింపవచ్చునుగదా యని తలంచి పరకాయప్రవేశవిద్యవలన తనప్రాణముల నాబాలకుని కళేబరమున ప్రవేశపెట్టెను. వెంటనే యాకుమారశవము సజీవమై లేచి కూర్చుండెను. కూర్చుండినవెంటనే యొకమారు నవ్వి పిదప రోదన మొనర్చెను. తదనంతరము బంధువు లంద రాబాలుని సజీవునిగా దలంచి యింటికి గొనిపోయిరి. రాజా! వింటివిగదా! ఆయోగి కళేబరములో

ప్రవేశించినవెంటనే నవ్వుటకును- తరువాత రోదన మొనర్చుటకు గారణ మేమి? అని యడుగ రా జిట్లనియె. ఇంకను చిరకాలము సుఖానుభవ మును పొందవచ్చునని మొదట సంతసించెను. కాని యంతలో వివే కము దెచ్చుకొని అయ్యో! ఈశరీరమైన మరికొంతకాలమునకు నశించు నదేకదా! మోక్షప్రదమైన యపవర్గమార్గమును వదలి తిరిగి విషయవాం ఛలకేల లోబడితినా యని దుఃఖించెను అని చెప్ప భేతాళుడు మరల పై కెగిరెను. విక్రము డతనిబట్టి క్రిందకు దెచ్చెను.

# ఇరువదిరెండవకథ.

భేతాళు డిట్లు చెప్ప నారంభించెను. విదర్భదేశమున నొక గ్రామములో నారాయణశర్మ యను బ్రాహ్మణుడు, పండితుడు గలడు. అతడు సకలవిద్యలను నేర్చి పండితుడై భార్యతో గృహస్థధర్మముల నెఱవేర్చుచు ముగ్గురు కొమరులను, ఇద్దరు కుమారికలను గనెను. చిర కాలము గడచెను. వృద్ధు డయ్యెను. కాని యానారాయణశర్మకు భోగ వాంఛ నశింపలేదు. అందువలన నాత డొకనాడు వెలుపలి కేగి మృతు డైన నొకబ్రాహ్మణయువకునిశరీరములో పరకాయవిద్యామాహాత్మ్యము వలన తనప్రాణములను బ్రవేశపెట్టి మారుశరీరముతో దనవారల జూడ వచ్చెను. భార్యాపుత్రు లందరు నితని జూచి వెరగుపడ నారంభించిరి. వేరుశరీరమును ధరించి వచ్చిన యాతడు మొదట తనవారి నందరిని జూచి కన్నీరు గార్చి పిదప నవ్వుచు నిట్లనియె. మీ రందరు నన్ను జూచి భ్రమపడుచున్నారు. నే నీయింటియజమానిని. వృద్ధుడ నగుటచే నాప్రాణముల నీశరీరములో బ్రవేశపెట్టి భోగాభిలాషచే యిట కరుగు దెంచితిని. ఇదంతయు నాపరకాయవిద్యాప్రవేశఫలము. నా కిప్పుడు విరాగము కలిగినది. ఈలోకములో నెవ్వరి కెవ్వరును లేరు. ఇదంత యును నాటకము. ఈనాటకములో నెవరిపాత్రను వా రభినయించి తెర మరుగున కేగుచున్నారు. ఈయస్థిరభోగములకొఱకు ప్రతివాడును

భ్రమపడి ధర్మాధర్మవిచారణను వదలి మోహమగ్నుడై తిరుగుచున్నాడు. బాల్యయవ్వనవార్ధక్యదశలు గడచినను- చూపులు తప్పినను - పండ్లూడిపోయినను- కఱ్ఱ చేతికి వచ్చినను తృష్ణామాత్రము వదలదు. కాలమంతయు నిదేరీతిగ జరుగుచున్నది. ఒకడు పోవుచున్నాడు. ఇంకొకడు వచ్చుచున్నాడు. తాను మరల పోవునా డయ్యును పోయిన వానికొఱకు దుఃఖపడుచున్నాడు. కావున వివేకవంతుడగువాడు పుట్టిన ప్రతిప్రాణియు నశించునని నిశ్చయింపవలయును. ఆశ యనునది మహానది. మహాయోగీంద్రులుగాని దానిని దరింపజాలరు.

శ్లో. ఆశానామ నదీ మనోరథజలా తృష్ణాతరంగాకులా।
రాగగ్రాహవతీ వితర్కవిహగా ధైర్యద్రుమధ్వంసినీ।
మోహావర్తసుదుస్తరాతిగహనా ప్రోత్తుంగచింతాతటీ।
తస్యాపారగతా విశుద్ధమనసా నందంతి యోగీశ్వరాః॥

అను నార్యోక్తిని స్మరింపుడు. మానవుని జీవితము నూరేండ్లు. సగముకాలము నిద్రతోడను, మిగిలినదానిలో సగము శైశవక్రీడాదుల తోడను, విషయాదులతో గడచిపోవ మిగిలిన కొంచెమును వృథాసేయుట మంచిలక్షణము కాదు. అని యీవిధముగ జ్ఞానోపదేశ మొనర్చి నేను తీర్థయాత్రలకు బోయి యెచ్చటనో తప మొనర్చి శరీరత్యాగ మొనర్చెద నని చెప్పి వెడలిపోయెను. రాజా! వింటివిగదా! అతడు మొదట రోదన మొనర్చుటకును, తదుపరి నవ్వుటకును కారణ మేమి? విక్రమార్కు డిట్లనియె. ఉన్న శరీరమును వదలి పరదేహములో బ్రవేశించుటవలన తన భార్య, పుత్రులు మొదలగువారు తనను దూరమై పోవుటేగాక తన భోగవాంఛ నెఱవేరనందులకు చింతించెను. తదుపరి వివేకము తెచ్చుకొని సంసారబంధవిముక్తిని పొందెదనుగదా యని సంతసించెను. అని చెప్పి భేతాళుడు మరల చెట్టుపై కెగిరెను.

# ఇరువదిమూడవకథ.

విక్రమార్కుడు పట్టి తెచ్చుచుండ భేతాళు డిట్లు చెప్ప నారంభించెను. జయస్థల మనుపట్టణమున విష్ణుస్వామి యనుపేరుగల బ్రాహ్మణుడు గలడు. అతనికి నల్వురు కొమరులు గలరు. వారిలో మొదటివాడు జూదరి. రెండవవాడు వేశ్యాలోలుడు. మూడవవాడు వ్యభిచారి. నాలుగవవాడు నాస్తికుడు. ఇట్లుండ కుమారుల దుర్గుణములను సహింపజాలక నొకదినమున నల్వురను బిలిచి యిట్లుపదేశించెను. జూద మాడువాడు దరిద్రు డగును. వానియింట లక్ష్మి నిలువదు. రాజనీతియందు జూదరి యొక్క కర్ణనాసికలను గోయవలయునని యున్నది. స్వభార్యయైనను తనభర్త జూదరియైన సమీపింప రాదు. కారణ మేమన, ఉన్నధనమును గోల్పోయినది గాక భార్యాపుత్రులను సైతము విక్రయించును. ఇంక వేశ్యాగమనమువలన నపకీర్తి. శరీరము రోగగ్రస్త మగును. ఇంతేగాక తన ధనమును వారి కిచ్చి దరిద్రుడై యంతతో నైన దానిని మానలేక చోరత్వమున ధనార్జనమొనర్చి వేశ్యల కిడుటయేగాక తుదకు పట్టుబడి కారాగృహమున జిక్కుకొనును. ఇంక పరస్త్రీగమనము జేయువ్యభిచారి రౌరవాదినరకములకు బాల్పడును. వ్యభిచారిణియైన స్త్రీ భర్తనేగాక ప్రేమించినవానిని గూడ జంపుటకు వెనుదీయదు. ఇట్టి వ్యభిచారియైన పాపాత్ముని దేశభ్రష్టుని జేయవలయును. దైవగురుభయములనువిసర్జించి సర్వదా విషయవాంఛాలోలుడై ప్రవర్తించు కులనాశకుడు కొడుకైనను దూరముగ బారదోలవలయునేగాని యాదురాత్ముని నింటనుండనీయరాదు

ఈవిధముగ నావిష్ణుస్వామి యన్యాపదేశముగ కొమరులను మందలించెను. నల్వురును తండ్రిమాటలను విని సిగ్గుపడి విద్యాసంపాదనమున్కై యొకపట్టణమున కేగి యం దొకగురువు నాశ్రయించి కొంతకాలము చదివి పండితులై, మంత్రవేత్తలై తిరిగి తమయూరికి వచ్చుచుండిరి. ఇట్లు వచ్చుచుండ నొకచోట నొకబోయవాడు సింహమును చంపి దా

తోలును దీసి క్రిందపరచి యెముకలు, మాంసము మొదలగు వానిని మూట గట్టుకొని పోవుచుండగా చూచి యానల్వురును తమవిద్యల బరీక్షింప దలచి యాబోయవానికి ధన మిచ్చి యా మూటను దీసికొని తమ తమ విద్యాప్రభావములను పరీక్షింప నెంచిరి. ఒక డాసింహపుయెముకలను జంతువుయొక్క ఆకార మేర్పరచి దానిపై మంత్రోదకములు చల్లినంత నాయెముకలు కలుసుకొనిపోయెను. రెండవవా డామాంసమును ఆయా ప్రదేశములందు బెట్టి తనమంత్రప్రభావముచే నతికించెను. మూడవవా డాతోలును దానిపై గప్పి మంత్రోదకము చల్లినంతనే చర్మము అవయవములపై కలుసుకొనిపోయెను. నాలుగవవాడు తనమంత్ర ప్రభావముచే దానిని బ్రదికించెను. సింహమునకు ప్రాణములు రాగనే గాండ్రుమనుచు నెగిరి యానల్వురను భక్షించి తనత్రోవ నేగెను. రాజా! ఈ నల్వురిలో నెవ్వ డధికమూర్ఖుడు? అని ప్రశ్నింప రా జిట్లనియె. బ్రదికించినవాడే మహామూర్ఖుడు, కారణ మేమనగా! తాను నేర్చిన విద్యవలన ఆత్మరక్షణము, పరోపకారము జేయవలయును. అట్లు చేయలేక పోగా తా నభ్యసించిన విద్యవలన తనప్రాణమును బోగొట్టుకొని పరుల ప్రాణముల బోగొట్టినవానిని మూర్ఖు డనక నేమందుము. కావున బుద్ధిహీనుడు విద్వాంసుడైనను నిష్ప్రయోజకుడే. అని చెప్ప భేతాళుడు మరల చెట్టుకొమ్మ కెగిరెను.

## ఇరువదినాలుగవకథ.

విక్రమార్కునితో భేతాళు డిట్లు చెప్ప నారంభించెను. ధర్మపురమున వర్ధమాను డనురాజు రాజ్యమును జేయుచుండెను. ఆపట్టణమున గోవిందశర్మ యను బ్రాహ్మణుడు కలడు. అతనికి ముగ్గురు కుమారులు గలరు. వారికి హరిదత్తు, సోమదత్తు, యజ్ఞదత్తు అని నామకరణములు జేసెను. ఆబాలురకు పదేండ్లు నిండినతోడనే తండ్రి యుపనయనములజేసి వేదశాస్త్రాధ్యయనమునకై పరదేశమున నున్న

యొకగొప్పవిద్వాంసునికడ జదువవేసిరి. పదునెనిమిదిసంవత్సరములు గురుకులవాస మొనర్చి సకలవిద్యలయందు పాండిత్యమును సంపా దించి యింటికి వచ్చిరి. తండ్రి వారిముగ్గురకు ననురూపవతులగు కన్యక లను వివాహ మొనర్చెను. నగర మంతయు నీముగ్గురిప్రఖ్యాతినిగురించి విపరీతముగా జెప్పుకొనుచుండగా మంత్రులవలన రాజు విని యొకనాడు కొల్వుకూటమున కాపండితుల ముగ్గురను బిలిపించి మీ కే యే విద్య లయందు పాండిత్యము గలదన మొదటివాడగు హరిదత్తు డిట్లనియె. అయ్యా! నేను భోజనప్రియుడను. నా కావిషయమున నెక్కుడు పాండి త్యము గలదు. అని చెప్పెను. రెండవవాడగు సోమదత్తుడు నేను నిద్రాప్రియుడను. నిద్రపోవుటలో నేను మిక్కిలి పరిశ్రమ జేసితినని వచిం చెను. మూడవవాడగు యజ్ఞదత్తుడు నేను వనితాప్రియుడను. స్త్రీ సౌఖ్యమున నేను నిపుణుడనని మనవి యొనర్చెను. ప్రభు వాముగ్గురి మాటలను విని తనలో తానే నవ్వుకొని యిట్లనియె. విప్రవరేంసులారా! ఇవి! యేటిప్రజ్ఞలు? భుజించుటయు, నిద్రించుటయు, స్త్రీలతో సుఖించు టయు విద్య లగునా? మీరు మూర్ఖులవలె నున్నారన వా రిట్లనిరి. మహా రాజా! దేవరవారు పరీక్షించినచో నందలివిశేషములను జూపెద మనిరి.

మరునాడు రాజు భోజనప్రియుని బిలిచి షడ్రసోపేతమైన భోజ నము, రకరకముల పిండివంటలు నేర్పరులగువారిచే తయారు జేయించి యాతనికి గుడువపెట్ట నేర్పాటుచేసెను. భోజనప్రియుడు కడుపునిండ భుజించి యింటి కేగెను. రాజు పిలిపించి పదార్థము లెట్లున్నవి? తృప్తిగ భుజంచితిరా? యని యడుగ హరిదత్తు డిట్లనియె. మహారాజా! పిండివంట లు, కాయగూరలు మిగుల రుచ్యములుగా నున్నవికాని ప్రధానమైన యన్నమే బాగుండలేదు. అందువలన దృప్తిగ భుజింప జాలకపోయితిని. కారణ మేమనగా అన్నము వండిన బియ్యము శ్మశానవాటికలో పండిన పంట యగుటచే అన్నము వాసనగా నున్నదని చెప్పెను. రాజు వెం

టనే బియ్యమును పంపినవర్తకుని బిలిచి యడుగ అయ్యా! ఇది మాస్వం తభూమిలో తయారైన ధాన్యము. ప్రశస్తమైనవరి. ప్రస్తుతము మా భూమిలో నేమియు దోషము లేదుగాని తూర్పువైపున కొంతభాగము రెండేండ్లక్రింద శ్మశానముగా నున్నది. దానిని ఏలినవారియనుమతిపై మేము తీసికొని సాగు చేయించుచుంటిమి. ఇప్పుడు దివ్యమైనపంట పండుచున్నదని చెప్పెను. రాజు వర్తకుని బంపి హరిదత్తునివిజ్ఞానశక్తికి చాల సంతసించి తగినబహుమతి నొసంగి పంపెను. రెండవవాడగు నిద్రాప్రియుడైన సోమదత్తుని బిలిచి నాటిరాత్రి తన నగరులో నొకవిశా లమైనగదిలో పందిరిమంచముపై మెత్తనిపరుపుల నైదింటిని పరపించి మృదువైనశాల్వలు పక్క వేయించి పరుండుమని చెప్పెను. సోమదత్తు డారాత్రి యంతయు బరుండెను. రాజు మరునాడుదయమున సోమదత్తుని బిలిచి నిద్ర పట్టిందా? పక్క బాగుగా నున్నదా యన నాతడో మహా రాజా! ఏలినవారియనుగ్రహమున పక్క బాగుగనే యున్నది. చల్లని గాలి వచ్చుచున్నది. కాని ప్రక్కక్రింద నెప్పటనో తలవెంట్రుక యుం డుటచే వత్తుకొని నిద్ర పట్టలేదు అని చెప్పెను. రాజు పరీక్ష సేయించి పై పరుపులు నాలుగు తీయగనే క్రిందనున్నపరుపుపై నొకపొడుగైన తలవెంట్రుక పడియుండెను. రాజు ఆనందించి వానిని సత్కరించి పంపి మూడవనాటిరాత్రి తననగరులో నొకగదిని శృంగారింపజేసి నూతనరజ స్వలయై కన్నెఱికముగాని సుందరాంగియైన చక్కనివేశ్య నొకదానిని దివ్యవస్త్రాభరణాదులచే సలంకరింపజేసి యాగదిలో నుంచి వనితాప్రి యుని బిలిచి నేటిరాత్రి యీసుందరితో సుఖింపుమని పంపెను. వనితా ప్రియుడు లోని కేగెను. తలుపులను బంధించిరి. తెల్లవారగనే ప్రభువు వనితాప్రియుని బిలిపించి యీవేశ్యాంగనగుణము లెట్టివి? రసికు రాలగు నా? హృదయమును రంజింపజేసినదా యన వనితాప్రియు డిట్లనియె. మహా రాజా! ఆవేశ్య సకలగుణములు కలది. మంచిరసికత- చక్కనిగానము-

కలదుగదాయని యాసపడ దగ్గరకు జేర్చితినిగాని దానినోరు మేకపాల వాసన వేయుటచే నాయాస లన్నియు వ్యర్థమైనవి. నేను వేరుగ పరుంటిని. అని చెప్పెను. రాజు దానితల్లిని బిలిచి యడుగ నది దేవా! యిది నాపెంపుడుకుమార్తె. దీనిని గన్నతల్లి పురిటిలోనె చనిపోయినది. వేరుపాలు పడకపోవుటచే మేకపాలతో పెంచితినని చెప్పినది. రాజు దానిని బంపి- ఔరా! వీరంద రొకరికి మించినవా రింకొకరని తలంచి వనితాప్రియుని సత్కరించి బంపెను. రాజా! ఈముువ్వురిలో నెవరితెలివి కొనియాడదగినది అని యడుగ విక్రమార్కుడు నిద్రాప్రియుని గొనియాడవలయునని చెప్పెను. కారణ మేమనగా? మృదువులగు నాల్గుపరుపులక్రిందబడిన సూక్ష్మమైన తలవెంట్రుకవలన నతనికి నిద్రాభంగ మైనదన్నచో నది తప్పక ప్రశంసనీయమని నొక్కి చెప్పక తప్పదు అని చెప్ప భేతాళుడు మరల వృక్షశాఖ కెగిరెను.

## ఇరువదియైదవకథ.

విక్రమార్కుడు భేతాళుని పట్టి తెచ్చుచుండ భేతాళు డిట్లని చెప్పదొడంగెను. రాజా! వినుము. శ్రీచక్ర మనుపట్టణమున మహాబలుడను రాజు రాజ్యము చేయుచుండెను. శత్రురాజు లిర్వ రతనిరాజ్యము నపహరింపవలయునను తలంపుతో సైన్యసమేతులై వచ్చి శ్రీచక్రపురమును ముట్టడించిరి. మహాబలుడు వారితో చిరకాలము యుద్ధమును జేసెను. తుదకు సైన్య మంతయు నశించిపోవుటచే పరాజితుడై యొకనాటిరాత్రి భార్యను, కుమార్తెను వెంటగొని యరణ్యము జేరెను. తెల్లవారువర కావనములో బహుదూరము పోయి యొకచెట్టుక్రింద విశ్రమించిరి. రాజు తనభార్యాపుత్రికల నట గూర్చుండబెట్టి వారి కాహారపదార్థములను సంగ్రహించుటకై సమీపమునగల గ్రామమున కేగి యానాటికి సరిపడిన భోజనపదార్థములను సంగ్రహించుకొని వనముననున్న

రాణిని, కుమార్తెను జేర వచ్చుచుండెను. మార్గమధ్యమున కొందరు భిల్లులు రాజును సంహరించి యాతనిభార్యాపుత్రికలకు బట్టి కొనిపో దలంచిరి. రాజునకు, భిల్లులకు నాసమయమున యుద్ధము తటస్థించెను. రాజు ధనుర్బాణములను చేత ధరించి నాయాటవికులతో ఘోరముగ బోరెను. భిల్లులలో కొందరు పారిపోయిరి. కొందరు హతులైరి. కాని భిల్లులు వేసినబాణములలో- నొకటి రెండు రాజైనమహాబలునికంఠమున తగులుటచే నతడును ప్రాణములను విడిచెను. రాణియు, కుమార్తెయు నావనమున రాజకళేబరమున బడి పెక్కుగతుల విలపించి దిక్కులేనివా రగుటచే యామహాబలునిశరీరమునకు సంస్కారమును గావించి యటనుండి బయలుదేరి చాలదూరము నడచి యొకగ్రామదేవతగుడిలో విశ్రమించి మార్గాయాసమును దీర్చుకొనుచుండిరి.

ఇట్లుండ చంద్రసేను రాజు తనకుమారునితో వేటకైవచ్చి యా వనములో వేటాడి తిరిగిపోవుచుండ రాణియొక్కయు, కుమార్తెయొక్క పాదచిహ్నములు గనుపడగా నిట్లు తలపోసిరి. ఇవి పురుషుల పాదముల వలె లేవు. స్త్రీలపాదములవలె నున్నవి. ఇర్వురుయువతు లీమార్గము నుండి నడచిపోయిరి. అని తలపోయుచుండ రాజు కుమారునితో నిట్లనియె. ఈమార్గమును బట్టిపోయి యాయిర్వురి స్త్రీలజాడ తెలిసికొందము. అందులో పెద్దయడుగులుగల యువతిని నీవు గైకొనుము. చిన్నయడుగులుగల దానిని నేను గ్రహింతును. అని చెప్ప కుమారు డంగీకరించెను. ఇర్వు రాజాడలను బట్టి పోయి గ్రామదేవతాలయమునగల రాణిని, కుమార్తెను కలసికొనిరి. త్రోవలో తాము జేసికొనిన నియమము ననుసరించి కుమార్తెను తండ్రియు, రాణిని కుమారుడును గుఱ్ఱములపై నెక్కించుకొని తమనగరముం జేరి వా రిర్వురిం జేపట్టిరి. కొంతకాలమునకు వారిర్వురకును కుమారులు గలిగిరి. రాజా! వా రిర్వురకును, తల్లులకును గల పరస్పరసంబంధమును దెల్పి మన విక్రమార్కుడీమారు ప్రత్యుత్తరము జెప్పుటకు తోచక ఆలోచించుచు నిల్చుండెను.

ఆలోచించుచు నిల్చున్న విక్రమార్కుని జూచి భేతాళు డిట్లని యె. రాజేంద్రా! నీసాహసమునకు, బుద్ధిసూక్ష్మతకును మెచ్చితిని. నీతో నొకవృత్తాంతమును దెల్పెదను వినుము. నన్ను బట్టితెమ్మని బంపిన యా యతి ధుర్మార్గుడు. నిన్ను జంపవలయునని తలంచియున్నాడు. శ్మశాన వాసినియైన యాదేవిని పూజించి నూటయెనుబదిమంది రాకన్నియలను గాని, సాహసవితరణాది గుణములుగల యొకరాజేంద్రునిగాని, మంత్రవేత్త యై, దీక్షాపరుడైన యతీశ్వరునిగాని బలియిచ్చినయెడల నాదేవి ప్రత్యక్ష మై యభీష్టవరము లొసంగును. ఈరహస్య మెరిగిన నాయతి నూటయెన బందుగురు రాజపుత్రికలు దొరకుట యసంభవ మగుటచే నిన్ను బలిగా గొసంగ దలంచినాడు. కావున నీ విప్పుడు నేను చెప్పినట్లు చేయుము. నే నిశరీరములోనుండి వెడలిపోవుచుంటిని. నీ వీకళేబరమును గొని యా యతిని జేరుము. ఆతడు స్నానము జేసి కళేబరమును అగ్నిగుండమున హోమము జేసి జపము పూర్తియైనతరువాత నిన్ను స్నానము జేసివచ్చి దేవికి సాష్టాంగపడు మని చెప్పును. అప్పుడు నీవు నీబుద్ధిసూక్ష్మతవలన నాయతిని మోసపుచ్చి కాళికి బలి యిచ్చితివేని నీ కాదేవి ప్రత్యక్షమై యభీష్టము లిచ్చును. నేను సర్వదా నీకు విధేయుడనై నీయాజ్ఞల జేయు చుండెదను. అని చెప్పి యాభేతాళు డాశవమునుండి తొలగిపోయెను. విక్రమార్కు డాకళేబరమును మోసికొని యాయతిం జేరి కళేబరము నెదుట నుంచి నమస్కరించెను. ఆసన్యాసి సంతసించి తనజప పూర్తి జేసి యాకళేబరము నగ్నిగుండములో హోమము జేసి విక్రముని జూచి రాజా స్నానము జేసి రమ్మని పంప విక్రముడు నెంటనే స్నాతుడై యటకు జేరెను. సన్యాసి యాతనిం జూచి రాజా! ఇటు వచ్చి దేవికి సాష్టాంగ నమస్కారము జేయుమన రా జిట్లనియె. స్వామీ! నేను ప్రభువు నగు టచే నాకు నమస్కరించిరిగాని నే నొకరికి నమస్కరింప లేదు. సాష్టాంగ నమస్కార మెట్లు చేయవలయునో చూపిన చేయుదునని చెప్పిన యతి

యీవిధముగ జేయవలెనని దేవిముందర సాష్టాంగపడెను. విక్రమార్కు డు వెంటనే కత్తిని దూసి యీసన్యాసిమెడపై నొక్క వ్రేటు వేసెను. తల తెగి క్రిందపడెను. వెంటనే కాళికాదేవి ప్రత్యక్షమై రాజా! నీసాహసము నకు మెచ్చితిని. వరమును వేడుమన రా జిట్లనియె.

తల్లీ! యీసన్యాసిని బ్రదికింపుము. నీ వింక జీవబలులను గోర వలదు. ఇదే నాకోర్కె యన కాళి విక్రమరాజా! నీయుదారబుద్ధికి మెచ్చి నీకోరినవరము లిచ్చితిని. నీవు వేయిసంవత్సరములు రాజ్యము జేసెదవు. భూతపతియగు భేతాళుడు నీయనుచరు డగుటచే భూతప్రేత పిశాచము లన్నియు నీ పేరుచెప్పినమాత్రమున బారిపోవును. నీచరిత్ర మును పఠించినవారికి మంగళములు కలుగును. దేవేంద్రుడు నిన్నర్ధ సింహాసనమున గూర్చుండ బెట్టుకొనును. నీకు సకలశుభములు కలుగు నని వర మిచ్చి కాళికాదేవి మాయ మయ్యెను. భేతాళుడు ప్రత్య క్షమై విక్రమార్కమహారాజా! నీ వెప్పుడు తలంచిన నప్పుడు వచ్చి నీయభీష్టంబులు నెరవేర్చెదను. నే నడిగిన యీయిరువదియైదుప్రశ్నము లను బఠించినవారికి పిశాచబాధ లుండవు. అని చెప్పి వెడలిపోయెను. విక్రమార్కుడు తదుపరి తననగరముం జేరి సకలజనాహ్లాదకరముగ రాజ్యమును జేయుచుండెను.

సంపూర్ణము.

శ్రీ శ్రీ శ్రీ

